# ఏది నిజమైన జ్ఞానము?

ఏది నిజమైన జ్ఞానము
ఏది నిబంధన జ్ఞానము
ఏది మతాతీత జ్ఞానము
ఏది ఆచరణ జ్ఞానము
ఏది దేవుని జ్ఞానము
ఏది శాస్త్రీయ జ్ఞానము


రచయిత : త్రిమత ఏకైక గురువు, ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



www.thraithashakam.org





# ఏది నిజమైన జ్ఞానము?


రచయిత

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, అర్ధ శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-37 ప్రథమ ముద్రణ : సం॥ 2015

ప్రతులు : 1000 వెల : **70 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు.
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) మతాతీత దేవుని మార్గము.
37) దేవుని గుర్తు - 963.
38) మతము-పథము.
39) ప్రబోధానందం నాటికలు.
40) ఇందువు క్రైస్తవుడా?
41) నిగూఢ తత్త్వార్థ బోధిని.
42) ఆత్మలింగార్థము.
43) నాస్తికులు-ఆస్తికులు.
44) హేతువాదము-ప్రతివాదము.
45) గుత్తా.
46) ప్రబోధ తరంగాలు.
47) త్రైత సిద్ధాంతము.
48) రూపము మారిన గీత.
49) ఉపనిషత్‌లలో లోపాలు.
**50) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**51) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**52) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**53) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**
54) ద్రావిడ బ్రాహ్మణ.
55) తీర్పు.
56) కర్మ పత్రము.
57) ప్రవక్తలు ఎవరు?
58) ధర్మశాస్త్రము ఏది?
59) మత మార్పిడి దైవద్రోహము.
60) త్రైతశక పంచాంగము.
61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) స్వర్గము ఇంద్రలోకమా! - నరకము యమరాజ్యమా!!
63) జీహాద్ అంటే యుద్ధమా?
64) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
65) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
66) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
67) వార్తకుడు-వర్తకుడు.
68) దేవుని చిహ్నము.
69) ఏది నిజమైన జ్ఞానము?

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు



***DVD'S***

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-
    లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-
    మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.

*DVD'S*

53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు- కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం- తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. దేశం మోసం-దేహం మోహం
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము
68. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు- అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప
76. నటించే ఆత్మ
77. సంచిత కర్మ
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము
81. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
82. భయం
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది.
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు
105. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

-: యూ ట్యూబ్ వీడియోలు :-

http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
**దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం**
Cell:9491040963, 9491877239, 9848590172.

*****

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం
Cell : 09445554354.

*****

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Cell : 70950 08369

*****

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

*****

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

*****

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664,9490809181, 8106065300.

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

*****

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మినారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell:9440556968,9290012413,9440601136.

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 9705959390, 9985580099

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,నెల్లూరు జిల్లా
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

*****

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా Cell : 9440305700,

*****

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell:9440047256, 9701956599

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్
7674979663, 9440042763, 8977713666, 9247826253

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

**చెన్న ఆంజనేయులు** (కరస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782

*****

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్) : 9493622669
క్రొత్త చెరువు (గ్రా, మం) అనంతపురం జిల్లా.
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

*****

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్
Cell : 9491773455, 9032903955.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902,

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా), 9441567394, 9502172711.

*****

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309, 7386212589.

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), వనపర్తి (తా)
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409, 9701261165.

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం), శ్రీకాకుళం
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం 1టౌన్, ప.గో.జిల్లా
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నేతాజిరోడ్డు కుప్పం,చిత్తూరు జిల్లా.
Cell : 9652755110,

*****

**ఘుడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

# ఏది నిజమైన జ్ఞానము ?

ప్రపంచములో పన్నెండు మతములున్నా, ఎవరి మతము వారికి గొప్పగా కనిపించుచుండినా, ఎవరి మతమును వారు గొప్పగా చెప్పుకొను చుండినా, నేడు అన్ని మతములకంటే పెద్ద మతములు మూడే గలవు. అవియే ఒకటి హిందూమతము, రెండు క్రైస్తవమతము, మూడు ఇస్లామ్ మతము. ఈ మూడు దైవ విధానము ప్రకారము మతములు కాకున్నా, ప్రజలందరూ మతములనే చెప్పుకొంటున్నారు. మూడు మతములందు మూడు గ్రంథములుండుట వలన, ఆ గ్రంథముల పేర్లు వేరువేరుగా ఉండుట వలన, ఆ మూడు గ్రంథములు వేరువేరు కాలములందు చెప్పబడి యుండుట వలన, గ్రంథములనుబట్టి, అవి పుట్టిన కాలమునుబట్టి, వాటి పేర్లనుబట్టి అందరూ మూడు మతములనియే చెప్పుచున్నారు.

మతము అనుపేరు కలియుగములో మాత్రము వినిపించుచున్నది గానీ, మిగతా జరిగిపోయిన మూడు యుగములలో ఎక్కడా లేదు. సృష్ట్యాదిలో దేవుడు ఆకాశవాణి ద్వారా తన జ్ఞానమును తెలియజేయడమైనది. దేవుడు ప్రత్యక్షముగా ఎవరితోనూ మాట్లాడడు, కనుక నేరుగా దేవుడు చెప్పకుండా ఆకాశము ద్వారా ఏర్పడిన శబ్దముతో చెప్పించాడు. అలా చెప్పుటకు కారణము, దేవుడు తన ధర్మమును అతిక్రమించకుండా చెప్పాడని తెలియు చున్నది. దేవుని ప్రాథమిక ధర్మము ప్రకారము **రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడు.** ఈ ధర్మముల ప్రకారము దేవుడు తాను స్వయముగా జ్ఞానమును చెప్పకుండా, తన ప్రకృతిలో భాగమైన ఆకాశముచే చెప్పించాడు. అలా చెప్పిన జ్ఞానము దేవుడు సృష్ఠించిన సృష్ఠికంటే వేరుగా ఉండుట వలన దానికి **"జపర"** జ్ఞానము అను పేరు పెట్టడమైనది. 'జ' అనగా పుట్టినదనీ, 'పర' అనగా వేరుగా ఉన్నదని అర్థము. దేవుడు సృష్ఠించిన

సృష్టి అంతయూ ప్రకృతితో కూడుకొనియుండగా, దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకృతికంటే వేరుగా ఉండుట వలన, సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమునకు "జపర" అను పేరు వచ్చినది. "జపర" అను పేరు మొదటి యుగమైన కృతయుగములో అప్పటి జ్ఞానులందరికీ తెలిసియుండేది. తర్వాత త్రైతాయుగము నుండి (త్రేతాయుగము నుండి) ఆ పేరు కనుమరుగౌతా వచ్చినది. ద్వాపరయుగ చివరిలోనికి ఆ పేరు పూర్తి తెలియకుండా పోయినది. నేడు కలియుగములో మేము ఆ 'జపర' అను పేరు చెప్పితే, విన్నవారు అదేమిటి? తినేదా, త్రాగేదా! అని అడుగుచున్నారు.

ద్వాపరయుగము చివరిలో భూమిమీద జ్ఞానము కరువైపోయినదనీ, అధర్మములు చెలరేగి, ధర్మములకు ముప్పువచ్చినదనీ తెలిసిన దేవుడు, భగవంతుడను మారువేషముతో భూమిమీదికి వచ్చి, తిరిగి దైవజ్ఞానమును తెలిపి ధర్మములను నెలకొల్పిపోయాడు. అలా వచ్చిన దేవుడు భగవంతునిగా మనుషులకు కనిపించి, తాను సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే తిరిగి ఇప్పుడు చెప్పుచున్నానని చెప్పాడు. అయితే అప్పుడు "జపర" జ్ఞానమును చెప్పు చున్నానని చెప్పలేదు. అందువలన కృతయుగములో తెలియకుండా పోయిన పేరు ఇంతవరకు తెలియకుండా పోయినదనియే చెప్పవచ్చును. ఎప్పుడో మొదటి యుగములో తెలియకుండా పోయిన 'జపర' అను పేరుతో మనకేమి పని? అట్లు కృతయుగములో దైవజ్ఞానమునకు ఒక పేరున్నప్పుడు, ద్వాపర యుగములో భగవంతునిగా దేవుడు జ్ఞానమును చెప్పునప్పుడు 'జపర' అను ఆ పేరును ఎందుకు చెప్పలేదు? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగాగలదు.

సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమునకు 'జపర' అను పేరుండడము వాస్తవమే! అయితే ఆ పేరును జ్ఞానమును చెప్పిన దేవుడు (భగవంతుడు)

చెప్పలేదు. జ్ఞానమును తెలుసుకొన్న జ్ఞానులు పెట్టిన పేరు. అందువలన ద్వాపర యుగములో భగవద్గీతను బోధించిన భగవంతుడయిన కృష్ణుడు ఆ పేరును చెప్పకుండా సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమును ఇప్పుడు చెప్పు చున్నానని అన్నాడు. తాను చెప్పని పేరును తానే అప్పుడు చెప్పడము అవసరము లేదనుకొన్నాడో ఏమో! అయితే దేవుడే వదలివేసిన పదమును లేక పేరును ఇప్పుడు మీరు ఎందుకు చెప్పుచున్నారనీ? దానితో మనకేమి అవసరమనీ? కొందరు అడుగుచున్నారు. దేవుడు మొదట తన జ్ఞానమును సంపూర్ణముగా చెప్పాడు (చెప్పించాడు). అప్పుడు తాను చెప్పిన జ్ఞానమునకు పేరు పెట్టలేదు. దాని రుచిని చూచినవారు దానికి తగిన పేరు పెట్టగలరని ఆ పనిని దేవుడు ప్రజలకే వదలివేశాడు. ఒక రైతు పండించిన ధాన్యమును బజారులో అమ్మిన తర్వాత ప్రజలు ధాన్యమును తిని రుచి చూచి ధాన్యము మంచివయితే మంచివనో, చెడువయితే చెడువనో పేరు పెట్టగలరు. ధాన్యము యొక్క వాస్తవిక రుచిని ధాన్యము తినిన వారు చెప్పవలసిందే గానీ ధాన్యమును అందించినవాడు చెప్పడు. అలాగే తన జ్ఞానమును గురించి దేవుడు ప్రజల నిర్ణయానికే వదలివేశాడు. ఆనాడు దేవుని జ్ఞానమును తెలిసిన జ్ఞానులు జ్ఞానముయొక్క సారాంశమును తెలిసిన వారై, అది ప్రకృతికంటే వేరయినదిగా ఉండుట వలన, సృష్టింపబడిన దానికంటే వేరుగాయుండి సృష్టి రహస్యమును తెలియజేయు జ్ఞానముగా ఉండుట వలన దానికి "జపర" జ్ఞానము అని పేరు పెట్టారు. అప్పుడు దేవుడు అందించిన జ్ఞానము యొక్క ప్రత్యేకత తెలిసిపోయినది. తర్వాత భూమిమీదికి ప్రజల మధ్యలోనికి ఎన్నో జ్ఞానములు దేవుని పేరే పెట్టుకొని వచ్చాయి. అయితే 'జపర' జ్ఞానముకంటే అన్నీ తక్కువ స్థాయివే అని తెలిసిపోయినది. ఉదాహరణగా ఒక విషయమును చెప్పుకొందాము.

పూర్వము దాదాపు అరవై (60) సంవత్సరముల క్రిందట కొన్ని రకముల వడ్లు, వాటి బియ్యము ఉండేవి. అందులో ఒక 'చెన్నంగి' బియ్యము అను ఒక రకము బియ్యముండేవి. అప్పుడున్న దాదాపు పది రకముల బియ్యములలో అన్నీ తెల్లగవుంటే చెన్నంగి బియ్యము ఎర్రగ ఉండేవి. అట్లే అన్ని రకముల బియ్యముకంటే ఎక్కువ లావుగావుండి, చూచేదానికి మొరటుగా ఉండేవి. లావుగా, ఎర్రగాయున్నా చెన్నంగి బియ్యము చూచే దానికి బాగా కనిపించకుండినా, అన్నము వండితే అన్నము ఎర్రగా కనిపించినా, రుచిలో మాత్రము అన్ని బియ్యములకంటే బాగుండేవి. ఏ కూరలోకయినా అన్నము రుచిగా ఉండేది. చాలామంది చెన్నంగి బియ్యమును నోటిలో పోసుకొని నమిలేవాళ్ళు. కొంతమంది రుచిగా ఉంటాయని నీటిలో నానబెట్టుకొని నమిలి తినేవారు. అన్ని రకముల బియ్యములలో చెన్నంగి బియ్యము మంచిపేరును సంపాదించుకొన్నది. చెన్నంగి బియ్యము బాగున్నాయని బియ్యమును సృష్ఠించిన దేవుడు చెప్పలేదు. ఆ బియ్యమును తినిన మనుషులు చెప్పారు. అదే విధముగా జ్ఞానమును ఇచ్చిన దేవుడు తన జ్ఞానము ఎట్లున్నది చెప్పలేదుగానీ, దేవుని జ్ఞానము యొక్క అనుభవమును పొందినవారు, అన్ని జ్ఞానములలో దేవుని జ్ఞానము గొప్పదనీ, దానితో సమానమైనదిలేదనీ, ప్రకృతికంటే భిన్నమైనదనీ, సృష్ఠి కంటే వేరయినదనీ దానిని "జపర" జ్ఞానమని అన్నారు. ఎన్నో రకముల బియ్యములలో చెన్నంగి బియ్యము అన్నముగా తినేదానికి, బియ్యముగా నమిలే దానికి రుచిగా ఉన్నాయని చెప్పినట్లు, ఎన్నోరకముల జ్ఞానములలో సృష్ఠ్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానము గొప్పదని దానికి ప్రత్యేకమైన 'జపర' అను పేరు పెట్టి చెప్పారు.

దేవుని జ్ఞానమును మనుషులు ఎట్లు చెప్పినా మనుషుల మాటను దేవుడు చెప్పవలసిన పనిలేదు. అందువలన జపర జ్ఞానమును నేను రెండవ మారు నీకు చెప్పుచున్నానని భగవంతుడు భగవద్గీతను చెప్పినప్పుడు చెప్పలేదు. 'జపర' అను పేరును మనుషులమైన మనము పెట్టుకొన్నాము. అందువలన దాని అర్థమును, వివరమును చెప్పుకోవలసిన బాధ్యత మన మీదనేవుంది. మరొక విషయమేమనగా! దేవుడు భగవంతునిగా వచ్చి సాకారముగా అర్జునునకు ద్వాపరయుగములో జ్ఞానమును చెప్పాడు. మొదట చెప్పిన జ్ఞానమునే రెండవమారు అర్జునునకు చెప్పినప్పుడు కూడా అప్పుడు చెప్పిన జ్ఞానమునకు భగవద్గీతయని ఆయన పేరు పెట్టలేదు. కృష్ణుడు చెప్పిన జ్ఞానమును గ్రంథముగా చేసుకొన్న తర్వాత మనుషులే దానికి **"భగవద్గీత"** అని పేరు పెట్టారు. భగవంతుడు చెప్పిన 'జ్ఞాన హద్దు' అయినందున దానిని అదే అర్థము వచ్చునట్లు 'భగవద్గీత' అని అన్నారు. ఎక్కడగానీ దేవుడు తన జ్ఞానమునకుగానీ, జ్ఞాన గ్రంథములకుగానీ ఆయన స్వయముగా పేరుపెట్టలేదు. అన్నిటికీ మనుషులే పేర్లనుంచడము జరిగినది. ముస్లీమ్‌ల గ్రంథమని అందరూ అనుకొను ఖురాన్ గ్రంథమునకు కూడా దేవుడు ఆ పేరును పెట్టలేదు. అది దేవునివైపునుండి అవతరించిన గ్రంథమనీ, సత్యసమేతముగా వచ్చిన గ్రంథమనీ, అంతిమ దైవగ్రంథమని చెప్పారు తప్ప ఖురాన్ అను ప్రత్యేకమైన పేరును దేవుడు పెట్టలేదు. ఆ పేరును మనుషులే పెట్టుకొన్నారు.

కొందరు భూమిమీద వారికి తెలిసిన జ్ఞానము ప్రకారము దైవ గ్రంథములు నాలుగని చెప్పుచున్నారు. కొందరు మూడు అని అంటున్నారు. మూడు గ్రంథములను అనుసరించి మనుషులు మూడు సమాజములుగా విడిపోయి, వాటికే మతము అని పేరుపెట్టుకొన్నారు. కావున మూడు

మతములకు మూడు గ్రంథాలే ఉన్నాయి అని కొందరంటున్నారు. గ్రంథములు ఒకటి తౌరాత్, రెండు ఇంజీలు, మూడు ఖురాన్ అని చెప్పుచున్నారు. మూడు గ్రంథములకు మూడు ముఖ్యమైన మతములు తయారైనవనీ, అందులో ఒకటి ఇందూ (హిందూ) మతము. రెండు క్రైస్తవ మతము, మూడు ముస్లీమ్ మతము అని అంటున్నారు. అయితే మతములు మూడయినా గ్రంథములు మాత్రము నాలుగుగలవని కొందరంటున్నారు. అవి వరుసగా ఒకటి జబూర, రెండు తౌరాతు, మూడు ఇంజీలు, నాలుగు ఖురాన్ అని అంటున్నారు. అయితే వీటిలో ఒక్క ఖురాన్ తప్ప మిగతా మూడు గ్రంథములను గురించి చాలామందికి తెలియ దనియే చెప్పవచ్చును. ఇందులో ఇంజీలు అనగా బైబిలు గ్రంథమని కొందరికి తెలిసినా, తౌరాతు అంటే ఏమిటో ఎవరికీ తెలియదు. తౌరాతు గ్రంథమని చెప్పువారు ఎవరయినా దానిని చూడలేదు. అది ఏ భాషలో అచ్చయినది తెలియదు. అది ఎక్కడున్నది తెలియదు. తౌరాత్ అనునది తెలిసినా, తెలియకపోయినా అది దైవగ్రంథమని మేము కూడా చెప్పు చున్నాము. అయితే తౌరాత్ అను పేరు విదేశములలో గల పేరనీ, అందువలన ఆ పేరును ఖురాన్ గ్రంథములో చెప్పారని తెలియుచున్నది. అందరికీ తెలియని రహస్యమేమంటే తౌరాత్ గ్రంథము మొదట భారత దేశములోనే పుట్టినది. భారతదేశములో ఆ గ్రంథము యొక్క పేరు 'భగవద్గీత' యని చెప్పబడినది. 'భగవద్గీత' అను పేరును భారతీయులు భగవంతుడు చెప్పినదన్నట్లు అర్థమొచ్చులాగా 'భగవద్గీత' అను పేరునుంచగా, పడమటి దేశములలో వారి భాషలో సరిపోవులాగా మూడు అంధకారములు, మూడు తెలియని రహస్యములు, మూడు తెలియని చీకటి రాత్రులను అర్థమొచ్చు లాగా భగవద్గీతను 'తౌరాత్' గ్రంథమని అన్నారు. మూడు ఆత్మల విషయము ఉండుట వలన 'చీకటితోనున్న తెలియని ఆత్మలు' అను ఉద్దేశ్యముతో ఆ

గ్రంథమును మనుషులు తౌరాత్ గ్రంథమని అన్నారు. ఈ వివరమును ఈ మధ్యకాలములో **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అను గ్రంథములో మేము స్వయముగా చెప్పడము జరిగినది. మూడు రాత్రుల వివరముతో తౌరాత్ గ్రంథమంటే ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతయని తెలిసిపోయినది.

ఇక అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ఒకచోట చెప్పబడిన 'జబూర' అను పేరు వాస్తవమే అయినా అది గ్రంథముకాదు. కొందరు పొరపాటుగా జబూర అనునది ఒక గ్రంథమనుకొనినా అది వాస్తవము కాదు. జబూర అనునది పడమటి దేశములలో చెప్పు పేరు. 'జబూర' అను పేరు భారతదేశములో 'జపర' అను పేరుగా ఉండెడిది. భారత దేశములో 'జపర' అను పేరు కొస్త మార్పుచెంది విదేశములలో 'జబూర' అని పిలువబడినది. జబూర అని పేరు మారినా, మారకున్నా అది గ్రంథము కాదు. గ్రంథరూపముకాని దైవజ్ఞానమును భారతదేశములో జపర అనియూ ఇతర దేశములలో జబూర అనియు చెప్పెడివారు. సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానము గ్రంథరూపము కాని మూడు యుగములలో దైవజ్ఞానము నకు జపర లేక జబూర అని పేర్లుండెడివి. కాలక్రమేపీ భారతదేశములో జపర అను శబ్దమే లేకుండాపోయినది. కొంత పేరు మార్పుతో పడమటి దేశములలో జబూర గా నిలచినా, అది శబ్దరూపమైన జ్ఞానమని తెలియక వ్రాతరూపమైన గ్రంథమని అనుకొంటున్నారు. ఈ విధముగా దేవుని జ్ఞానము మనుషుల చేత నాలుగు పేర్లుగా పిలువబడుచున్నది. అయితే ఈ నాలుగు పేర్లలో ఏ ఒక్క పేరుకూడా దేవుడు పెట్టినది కాదు.

జబూర లేక జపర అనుపేర్లు గలవి గ్రంథములు కాదు అను విషయము ఇంతవరకు ఎవరూ చెప్పియుండలేదు. అవి గ్రంథములు

కాదు అను విషయము ఇక్కడే ఇప్పుడే క్రొత్తగా వింటున్నారు. ఇది క్రొత్త విషయమైనందున చాలామందికి చాలా ప్రశ్నలు రావచ్చును. కొందరికయితే ప్రశ్నలతోపాటు అసూయ గుణము కూడా పొడచూపగలదు. ప్రశ్నలు వస్తే దానికి అన్ని విధముల జవాబును చెప్పుటకు మేము సిద్ధముగా యున్నాము. అయితే అసూయతో మాట్లాడు వారికి మేము ఏమీ జవాబును చెప్పము. వారికి ఒకే మాటను చెప్పగలము. అదేమనగా! మేము చెప్పునదే సత్యమని, నమ్మమని నేను చెప్పడము లేదు. **జ్ఞానమును సత్య సమేతముగా జ్ఞాపకము చేయడమే నా కర్తవ్యము. నా మాటను నమ్మి వినే ధ్యాసలోనున్న వారికి ఎటువంటి ప్రశ్నవచ్చినా ఆ సంశయమును తీర్చడము మా బాధ్యత.** అందువలన అన్వేషణ దృష్టితో ఎవరు ప్రశ్న అడిగినా దానికి జవాబును చెప్పగలము.

**1, ప్ర:- మీరు దైవగ్రంథముల పేర్లను దేవుడు పెట్టలేదు, మనుషులే పెట్టారని చెప్పుచున్నారు. అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ఆరవ సూరా 91వ ఆయత్‌లో "తౌరాత్ గ్రంథమును దేవుడే మనుషులకు ఇచ్చినట్లు కలదు". అంతేకాక ఐదవ సూరాలో 44వ ఆయత్‌నందు "తౌరాత్ గ్రంథమును నేనే అవతరింపజేశాను" అని దేవుడే చెప్పినట్లు కలదు. దీనినిబట్టి చూస్తే దేవుడే ఆ పేర్లు ఆ గ్రంథములకు పెట్టాడని తెలియుచున్నది కదా! అలాంటప్పుడు మనుషులే ఆ పేర్లను పెట్టారని మీరు ఎలా చెప్పగలరు?**

**జవాబు :-** అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో చాలాచోట్ల తౌరాత్ గ్రంథమును నేనే అవతరింపజేశాననీ, అట్లే కొన్నిచోట్ల ఇంజీలు (బైబిలు) గ్రంథమును కూడా నేనే ఈసా (ఏసు) ద్వారా ఇచ్చానని చెప్పినట్లు కలదు. తౌరాత్ మరియు ఇంజీలు గ్రంథములు రెండు ఖురాన్‌కంటే ముందు వచ్చినవే. అయితే ఆ పేర్లను మనుషులే పెట్టారు. మనుషులు పెట్టిన

పేర్లనే ఖురాన్ గ్రంథములో చెప్పారు. అంతేగానీ దేవుడు స్వయముగా పేర్లు పెట్టినట్లు లేదు కదా! ఉన్న పేర్లతో ఆ గ్రంథములను గురించి చెప్పాడు. ఖురాన్ గ్రంథములో ఆ గ్రంథముయొక్క పేరును అనగా 'ఖురాన్' పేరును దేవుడు ఎక్కడా చెప్పలేదు. దేవుడు దానిని ఇది నా శాసనమనీ, నా సత్యమని, నా ఆజ్ఞ అని వర్ణించుచూ చెప్పాడుగానీ పేరుపెట్టి చెప్పలేదు. దేవుడు చెప్పిన తర్వాత దానిని మనుషులు 'ఖురాన్' అని పిలువడమైనది. దేవుడు తన జ్ఞానమును తాను పేరుపెట్టి ఎక్కడా చెప్పలేదు. మనుషులు చెప్పిన పేరునే దేవుడు చెప్పాడు. దేవుడు జ్ఞానమును చెప్పిన తర్వాత దానికి మనుషులు పేరుపెట్టడమైనదని మరువకూడదు.

**2, ప్ర :- దేవుడు ఎక్కడా చెప్పని పేర్లను మీరు క్రొత్తగా చెప్పచున్నారు. "జపర" అను పేరు ఏ గ్రంథమందుగానీ, దేవుడు చెప్పిన ఏ బోధయందు గానీ లేదు. అటువంటి దానిని మీరు క్రొత్తగ పేరుపెట్టి వ్రాసి ఇది దేవుడు చెప్పిన జ్ఞానము అంటున్నారు. ప్రపంచములో మీరుతప్ప ఇంకెవ్వరూ ఈ విషయమును చెప్పలేదు. "జపర" అను పేరును మీరు సృష్ఠించి దానిని దేవుని గ్రంథముతో లేక దేవుని జ్ఞానముతో సంబంధ పెట్టడము మంచిది కాదేమో అనిపిస్తావుంది. పైగా ఈ కార్యము దైవవిరుద్ధమేమో అనిపిస్తా వుంది. ఎందుకనగా! ఖురాన్ గ్రంథములో సూరా రెండు ఆయత్ 79లో ఇలా కలదు. (2-79) "తమ స్వహస్తాలతో లిఖించిన గ్రంథాన్ని దైవగ్రంథమని చెప్పి, ప్రాపంచిక తుచ్ఛ ప్రయోజనాన్ని పొందజూసే వారికి 'వినాశం' కలదు. వారి ఈ స్వహస్త లిఖిత రచన వారి వినాశానాకి దారి తీస్తుంది. వారి ఈ సంపాదన కూడా వారి నాశనానికి కారణభూతమవుతుంది." అని కలదు. ఇప్పుడు "జపర" అను పేరును మీరు స్వయముగా వ్రాసినది కాదా? ఈ ఆయత్‌లో చెప్పిన దానికి మీరు ఏమి జవాబు చెప్పగలరు?**

**నా జవాబు :-** ఖురాన్‌లో చెప్పిన వాక్యమును సత్యమని నేను ఒప్పు కుంటున్నాను. ఎవరయినా స్వయముగా వ్రాసి దేవుడు చెప్పిన జ్ఞానమని నమ్మించడము తప్పేయగును. అయితే ఇక్కడ మేము 'జపర' అను పేరు మనుషులు పెట్టినదే అని చెప్పానుగానీ, దానిని దేవుడు చెప్పాడని అసత్యము చెప్పియుంటే నాది తప్పగును. "ప్రపంచములో ఎవరూ చెప్పని పేరును మీరు చెప్పారు" అని అన్నారు. ఇప్పుడు నేను చెప్పిన 'జపర' అను పేరును ప్రస్తుత కాలములో ఎవరూ చెప్పనిదే! అది నాకు తప్ప ఎవరికీ తెలియదు, కావున ఎవరూ చెప్పుటకు వీలులేదు. మనుషులు ఎవరూ చెప్పని దానిని దేవుడు నా చేత చెప్పిస్తున్నాడంటే అది నాకు దేవుడిచ్చిన వరమే అని చెప్పగలను. నేను ఎక్కడయినా క్రొత్త విషయమును చెప్పినా అది ముందే దేవుడు చెప్పిన సూత్రమైవుండును. దేవుడు చెప్పని దానిని నేను ఎక్కడయినా చెప్పానని మీరు చూపగలరా? అయితే దేవుడు ఎక్కడా, ఏ గ్రంథములో చెప్పని విషయమును చాలాచోట్ల మీకు చెప్పాను. అది నిజమైన దేవుని జ్ఞానమని చెప్పాము. అయినా ఈ విషయములో నేను దోషిని కాను.

**3, ప్ర :- మీరు దేవుడు చెప్పని "జనన సిద్ధాంతము"ను అట్లే "మరణ సిద్ధాంతము"ను చెప్పి ఇది దేవుని జ్ఞానమని చెప్పారు కదా! ఇంతవరకు ప్రపంచములో ఎవరికీ తెలియని జనన సిద్ధాంతమును, ఎవరూ చెప్పని దానిని మీరు చెప్పారు. అంతేకాక ఇది నాకు తప్ప ఏ మనిషికీ తెలియదని కూడా కొన్ని సందర్భములలో చెప్పారు. పెద్ద డాక్టర్లకు కూడా ఈ జనన విషయము తెలియదని చెప్పారు. మీరు చెప్పినది సత్యముకాదని డాక్టర్లు సహితము చెప్పచున్నారు. అటువంటి అసత్య జ్ఞానమును చెప్పి అది దేవుడు చెప్పిన**

**జ్ఞానమే అని నమ్మించడము తప్పకాదా! ఈ విషయమును మీరు ఎలా సమర్థించుకోగలరు?**

**నా జవాబు :–** మీకు తెలిసినంత వరకు నేను చెప్పిన విషయములు దేవుడు చెప్పలేదు. అంతేకాక నాకు తెలిసినంతవరకు నేను చెప్పిన వివరమును, జ్ఞానమును దేవుడు కూడా ఎక్కడా చెప్పలేదు. కొంతవరకు అనగా మీకు తెలిసినంతవరకు నాది తప్పే అయినా నాకు తెలిసినంతవరకు (2–79) వాక్యము ప్రకారము కూడా నాది రవ్వంత కూడా తప్పులేదు. నాది తప్పులేదని నేను సమర్థించుకోనుగానీ, దానిని ఎలా తప్పుకాదో వివరించి చెప్పగలను. ఇక్కడ మీకు బాగా అర్థమగుటకు చిన్న ఉదాహరణను చెప్పెదను చూడండి. దేవుడు పొలములో ప్రత్తి పంటను పండించి ఇచ్చాడు. చేనులో (పొలములో) ప్రత్తి బాగా పండింది. దేవుడిచ్చిన ప్రత్తిని తీసుకొని దానిని ఉపయోగ పెట్టుకొనేది తెలియకపోతే దేవుడు ప్రత్తిని ఇచ్చి ప్రయోజనములేదు. పూర్వము నాగరికత తెలియని రోజులలో, మనిషి గుడ్డలు కట్టుకోని కాలములో, అడవిలో పండిన ప్రత్తిని చూచి అది ఎందుకు ఉపయోగపడుతుందో తెలియనివాడు ఉండగా, వానివద్దకు కొంత తెలివైన వాడు వచ్చి “ఇది మనుషుల శరీరమును మూసిపెట్టుకొనుటకు పనికి వస్తుంది” అని చెప్పాడట. అప్పుడు దానిని వినినవాడు ప్రత్తిని తీసుకొని శరీరమునకు అంటించుకొన్నాడు. కొంతసేపటికి అది ఊడిపోయింది, రాలి పోయింది. దానిని చూచిన తెలివైనవాడు వచ్చి ప్రత్తి విషయము వానికి తెలియదని గ్రహించి, మొదట ప్రత్తిని దూదిగా మార్చి దానినుండి దారమును తీసి, దారమును అల్లి గుడ్డగా చేసి ఇచ్చాడు. అప్పుడు ప్రత్తి మనిషి శరీరమును కప్పేదానికి పనికివచ్చింది. ప్రత్తిని తెలిసినవాడు గుడ్డగా తయారు చేసి ఇస్తే దానిని మనిషి ఎలా ఉపయోగించుకోవాలో విడదీసి

చూపినట్లయినది కదా! ప్రత్తి వుండేది మానవుని గుడ్డగా ఉపయోగపడే దానికే కదా! ఇప్పుడు తెలిసినవాడు ప్రత్తిని గుడ్డగా చేసి ఇవ్వడము తప్పు అంటామా? అలాగే దేవుడు తన జ్ఞానమును తన గ్రంథములలో ముడి ప్రత్తిగా ఇచ్చాడు. అయితే మనిషి దానిని ఎలా గ్రహించాలో? ఎలా ఉప యోగపెట్టుకోవాలో తెలియని స్థితిలో ఉన్నప్పుడు, దానిని వివరించి చెప్పుటకు భూమిమీద "గురువు" అనునతడిని కూడా ఇచ్చాడు. గురువు ద్వారా తన జ్ఞానమును విడదీసి చెప్పి మనిషికి ఉపయోగపడునట్లు చేశాడు. జనన సిద్ధాంతమును దేవుడు తన గ్రంథమందు ముడి సరుకుగా ఇచ్చాడు. దేవుడు ప్రథమ దైవగ్రంథములో సాంఖ్యయోగమున 22వ శ్లోకములో జనన సిద్ధాంతమును ముడిసరుకుగా, సులభముగా అర్థముకాని విధముగా చెప్పి యున్నాడు. అలాగే అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 95లో (6-95) వాక్యములో జనన సిద్ధాంతమును చెప్పియున్నాడు. అయితే ఇంతవరకు ఆ వాక్యములో జనన సిద్ధాంతముంది అని ఎవరికీ తెలియదు. ఆ వాక్యములలో మూటగట్టిన జ్ఞానమును తెలియుటకు మూటను విప్పి చూచుకోవలసియున్నది. అయితే ముడి విప్పలేక, మూటలో ఏముందో చూచుకోలేని వారికి మూటలోనున్నదేదో తెలియునట్లు నేను అక్కడవున్న మూటముడిని మాత్రము విప్పి చూపాము. ముడి సరుకయిన దూదినుండి దారము తీసి గుడ్డను తయారు చేసి మనిషికి ఉపయోగపడునట్లు చేశాము తప్ప, అక్కడ లేనిది మా స్వంతముగా చెప్పినది ఏదీలేదు. గ్రంథ ఆధారము లేకుండా కల్పించి చెప్పియుంటే మా తప్పగును. అట్లుకాకుండా మేము అన్నీ గ్రంథ ఆధారముతోనే చెప్పుచున్నాము. గ్రంథములలోని జ్ఞానము అర్థము కానివారు దూదితో శరీరమును కప్పు కొనుటకు ప్రయత్నము చేయుచున్న వారితో సమానము. అటువంటి

వారికి గుడ్డయొక్క ఉపయోగమే తెలియదు. వారు దూదినే వాడినా, అది సరియైన పద్ధతికాదని, దూదిని మార్పుచేసి గుడ్డగా ఇచ్చి పూర్తి ఉపయోగ పడునట్లు చేయుచున్నాము. ఈ విధానములో ఏద్దైనా గ్రంథమందు దేవుడు చెప్పిన విషయము అర్థముకాలేదో ఆ దైవగ్రంథములోని రహస్యమును విప్పి చెప్పడమే మా పని. ఆ విధముగా నా లోపలుండి చేయించేవాడు చేయిస్తున్నాడు.

ఖురాన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 95లో **“సజీవమునుండి నిర్జీవము, నిర్జీవమునుండి సజీవము”** ఎలా వస్తున్నదో ఇంతవరకు పండితులకు కూడా తెలియదు. అట్లే భగవద్గీతయందు సాంఖ్యయోగమున 22వ శ్లోకములో **“పాతవస్త్రమును వదలి, క్రొత్త వస్త్రమును ధరించినట్లు”** అని ఉదాహరణ చెప్పియున్నా పాతవస్త్రమేదో, క్రొత్త వస్త్రమేదో పెద్ద స్వామీజీలకు సహితము తెలియకుండాపోయినది. ఆ విధముగా తెలియకుండా పోవడమే కాక అక్కడ చెప్పిన జ్ఞానమును తప్పుగా అర్థము చేసుకోవడము జరుగుచున్నది. అటువంటి సందర్భములలో మేము అక్కడున్న జ్ఞాన వివరమును విడదీసి చెప్పుచున్నాము. అది ప్రజల కొరకు చేయు మంచి పనే కదా! నా స్వార్థము కొరకో, నా బ్రతుకుతెరువు కొరకో అలా చేయవలసిన పనిలేదు. అందరు స్వామీజీలున్నట్లు, మత పెద్దలున్నట్లు నేను కూడా సాధారణముగా అందరూ చెప్పు జ్ఞానమునే చెప్పుచూ బ్రతుకవచ్చును. నేను అలాకాకుండా ఇతరులు నన్ను చూచి అసూయపడుచున్నా వదలక ‘నిజమైన జ్ఞానమునే’ అందించాలనుకొన్నాను. నేను శరీరముతోయున్నంత వరకు అదే పని సాగుతుంది.

**4, ప్ర :- మీ ఉద్దేశ్యము మంచిదేగానీ, మీరు హిందూ సమాజములో ఉన్నారు కదా! ఏ మతమువారికి ఆ మత గ్రంథములో చెప్పిన జ్ఞానము అర్థము**

**కానప్పుడు, ఇతర మత గ్రంథములయిన ఖురాన్, బైబిలు గ్రంథములలోని వాక్యములకు వివరమును ఎలా చెప్పగలరు? చాలాచోట్ల మీరే హిందువులకు భగవద్గీత అర్థము కాలేదనీ, అట్లే మిగతావారికి కూడా వారి గ్రంథములని చెప్పకొను వాటిలోని జ్ఞానము అర్థము కాలేదని చెప్పారు. అటువంటప్పుడు హిందువయిన మీకు భగవద్గీత అర్థమయినదా? మీరు ఎక్కడ తర్ఫీదు అయినారు?**

**నా జవాబు :-** నేను ఇంతవరకు ఏ గ్రంథములోని జ్ఞానమును ఇతరులవద్ద నేర్చుకోలేదు. నేను మొదట చదివినది భగవద్గీత నా వయస్సు 25 సంవత్సరములున్నప్పుడు చదవడమైనది. తర్వాత బైబిలు గ్రంథమును పూర్తి చదవకున్నా అక్కడక్కడ నా వయస్సు దాదాపు 50 సంవత్సరములు ఉన్నప్పుడు చదివాను. ఖురాన్ విషయానికి వస్తే ఈ మధ్య నాలుగు లేక ఐదు సంవత్సరములనుండి చూడడము, చదవడము జరిగినది. నేను చదివిన తర్వాత బయట ప్రపంచములో ప్రజలవద్ద వున్న జ్ఞానమునకు నాకు తెలిసిన జ్ఞానమునకు ఎంతో తేడా కనిపిస్తూ వచ్చినది. మొదట హిందూ మతములోని స్వామీజీలు, పీఠాధిపతులు, బాబాలు, మఠాధిపతులు అయిన మత పెద్దలకే భగవద్గీత జ్ఞానము అర్థముకాలేదని తెలిసిపోయినది. దేవుడే భగవంతునిగా వచ్చి తన ధర్మములను జ్ఞానరూపములో భగవద్గీతగా చెప్పిపోయినా, దానిని వదలి దేవుడు చెప్పని వేదములను, పురాణములను, ఉపనిషత్తులను ఆశ్రయించి వాటిని భగవద్గీతకంటే గొప్పగా చెప్పువారు కలరు. హిందువులలో నూటికి ఎనభై శాతము జ్ఞానముమీద ఆసక్తి లేనివారై వారివారి పనులయందు లగ్నమైయున్నారు. మిగతా ఇరవైశాతము మందిలో పదిహేను శాతముమంది వేదములను, పురాణములను ఆశ్రయించినవారు గలరు. మిగతా ఐదుశాతము మంది భగవద్గీతను ఆశ్రయించినా వారిలో

పూర్తి ధ్యాస కేవలము రెండుశాతము మందికి మాత్రమున్నది. అలా ధ్యాసవున్న రెండుశాతము మందిలో, భగవద్గీతలోని జ్ఞానమును అర్థము చేసుకొన్నవారు అరుదుగా ఉన్నారని చెప్పవచ్చును. ఈ విధముగా భగవద్గీత భావము ప్రజలకు తెలియకుండా పోయినది. మేము భగవద్గీతను చదివి దాదాపు నలభై సంవత్సరములవుతుంది. అప్పటికే భారతదేశమున దాదాపు మూడువందల ఇరవై భగవద్గీతలు సంస్కృతమునుండి వేరువేరు భాషలలో అనువదించి వ్రాయడము జరిగినది. ఒక్క తెలుగు భాషలోనే దాదాపు యాభై భగవద్గీతలను వివిధ స్వామీజీలు వ్రాయడము జరిగినది. తెలుగులో యున్న దాదాపు నలభై భగవద్గీతలను మేము చూడడము జరిగినది. అన్ని భగవద్గీతలలోనూ దేవుడు చెప్పిన భావము కనిపించలేదు. భగవద్గీత శ్లోకములో ఉన్న భావము, వ్రాసిన వివరములో లేకుండా పోయినది. కొన్ని చోట్ల చెప్పినదొకటయితే వ్రాసినదొకటియుండగా, కొన్నిచోట్ల శ్లోకములో యున్నది ఏమాత్రము వివరములో ఉండదు. ఈ విధముగాయున్న భగవద్గీతలనుండి వ్రాసిన వానికే జ్ఞానము తెలియకపోగా, చదివేవానికి ఎలా అర్థమవుతుంది? చదివేవాడు వ్రాసిన వాని భావమునుబట్టి పోవును. అటువంటప్పుడు మనుషులకు భగవద్గీత అర్థమయిందని చెప్పుటకు వీలు లేకుండా పోయినది. మిగతా భాషలలోని భగవద్గీతను చూచినా అన్నీ అట్లే ఉన్నాయి. వ్రాసిన దానిని చదివేవారు సరిగా అర్థము చేసుకుంటారను నమ్మకము లేని ఈ కాలములో, వ్రాసినవారే సరిగా వ్రాయకపోతే, చదివే వారి పరిస్థితి ఎట్లుండునో చెప్పనవసరములేదు. ఈ విధముగా భారత దేశములోని ఆధ్యాత్మిక విద్య అర్థముకాకుండా పోయినదని తెలిసిపోయినది. ఒకరు ఎట్లు అనువదించియుంటే మిగతావారు కూడా దాదాపు అట్లే వ్రాసుకుంటూ పోవడము వలన, భగవద్గీత విషయములో అందరూ తప్పు దారి పట్టి పోయినట్లయినది.

దేశములో ఉండే ప్రజలందరికీ ఆధ్యాత్మికము మీద చింత ఉండదు. ఆధ్యాత్మికము మీద ధ్యాస ఉండేవారు కొంతమందే, అలాంటి వారిలో కొందరు పాఠకులుకాగా, కొందరు బోధకులుగా ఉందురు. పాఠకులు దాదాపు వేలసంఖ్యలో లేక లక్షల సంఖ్యలో ఉండగా, బోధకులు పదుల సంఖ్యలో ఉందురు. పదుల సంఖ్యలో ఉన్న బోధకులు బోధించిన దానినే పాఠకులుగాయున్న వారంతా తెలియుటకు అవకాశము గలదు. ఒక్క బోధకుడు తప్పు భావమును అందించితే, మిగతా పాఠకులందరూ అదే భావమును గ్రహించి, తప్పుదారిపట్టి అజ్ఞానమార్గములో పోవు అవకాశము గలదు. అట్లున్నప్పుడు మొత్తము బోధకులు అందరికి దేవుడు చెప్పిన జ్ఞానములో కీలకమైన విషయము అర్థముకానప్పుడు, బోధకులందరికీ ఆ విషయము తప్పుగా అర్థమయినప్పుడు, వారికి అర్థమయిన విషయమునే పాఠకులకు చెప్పడము వలన వారి బోధలను చదివే పాఠకులుగానీ, వారి మాటలను వినే శిష్యులుగానీ అందరూ మొత్తము తప్పుదారి పట్టిపోయినట్లగును. అలా అందరికీ జ్ఞాన విషయము అర్థము కానప్పుడు దేవుడు చెప్పిన జ్ఞానమే భూమిమీద మనుషులకు తెలియకుండా పోవును. దేవుడు చెప్పిన జ్ఞానము లేకుండా పోయి, దాని స్థానములో భావము మారిపోయిన జ్ఞానము వచ్చియుండుట వలన, దేవుడు చెప్పిన జ్ఞానము అందరికీ తెలిసినట్లే యుండును. అయినా అది దేవుడు చెప్పినది కాకుండాపోయి, మనుషుల భావముగా ఉండును. అటువంటప్పుడు ధర్మముల స్థానములో అధర్మములు వచ్చి చేరినాయని చెప్పవచ్చును. అధర్మములు బయట ఆకాశమునుండి ఊడిపడవు. అధర్మములు మనిషి తలనుండే పుట్టుచున్నవి. ఎప్పుడయితే దేవుడు చెప్పిన జ్ఞానమును మనిషి గ్రహించుకోలేకపోవుచున్నాడో, అప్పుడు వానికి తెలిసినది అధర్మమేగానీ, దేవుని ధర్మముకాదు. ఈ విధముగా మనిషి గ్రహించుకొను సమయములోనే

ధర్మములు అధర్మములుగా మారిపోవుచున్నవి. ఒకనికి ఒక సమయములో వాడు చదివిన దైవగ్రంథము నుండి అన్ని విషయములు బాగా అర్థమయి, ఒక విషయము మాత్రము అర్థము కాకపోయినదనుకో, అప్పుడు వానికి తెలిసిన ఎన్నో ధర్మములలో ఒక ధర్మము మాత్రము అధర్మముగా ఉన్నదని తెలిసిపోవుచున్నది. ఈ విధముగా కాలక్రమేపీ ధర్మములు అప్పుడొకటి, అప్పుడొకటి తెలియకుండా పోయినప్పుడు అవి అధర్మముగా మారిపోయినట్లే లెక్కించబడును. దేవుడు చెప్పిన జ్ఞానము మానవునకు ఎక్కువ శాతము తెలియకుండా పోయినప్పుడు ధర్మములు కృషించిపోయి, అధర్మములు ఎక్కువయిపోయాయని చెప్పవచ్చును. అటువంటి సమయములోనే దేవుడు ధర్మ సంరక్షనార్థము వచ్చి తన ధర్మములను వివరముగా చెప్పిపోవును. దేవుడు భగవంతునిగా భూమిమీద మనిషిగా వచ్చి తన ధర్మములను తెలుపువరకు మనిషిలోని అజ్ఞాన చిక్కు, అధర్మముల పీడ వదలిపోదు.

**5, ప్ర :- మీరు భగవద్గీతను చదివినప్పుడు దేవుడు చెప్పిన ధర్మములు మనుషుల వ్రాతలో అధర్మములుగా ఉన్నవని తెలిసిందా?**

**జవాబు :-** దాదాపు తొంభై (90) శాతము ధర్మములు అధర్మములుగా రూపు మార్చుకొని, భగవద్గీతలో కనిపించాయి. అలా ఉన్నప్పుడు భగవద్గీతను చదివే ప్రతివానికీ అధర్మములే తెలియునుగానీ, ధర్మములు తెలియవుకదా! అంతో ఇంతో జ్ఞానము మీద ధ్యాస కలిగి భగవద్గీతను చదవాలి అనుకొనువాడు గీతను చదివితే అందులో మనుషులు వ్రాసిన అధర్మములే చదివినవారికి తెలియును. అప్పుడు వారికి అధర్మములే తెలియును కదా! దేవుని ధర్మములేవో తెలియవు కదా! ఈ విధముగా ధర్మములు తెలిసినవారి సంఖ్య కాలక్రమములో తగ్గిపోయి, అధర్మములు తెలిసిన వారి సంఖ్య పెరిగిపోవును. నేను భగవద్గీతను చదివినప్పుడే

అనగా దాదాపు 40 సంవత్సరముల క్రితమే 90 శాతము అధర్మములు భగవద్గీతలో చేరిపోయాయని తెలసిపోయినది.

**6.ప్ర :- నేడు మనుషులకు ఏది ధర్మమో? ఏది అధర్మమో తెలియదు. అటువంటప్పుడు మీకు తెలిసిన ఒక ధర్మము అధర్మముగా ఎట్లున్నదో చెప్పండి. ధర్మముగా ఉన్నప్పుడు ఎలా ఉండాలి? అధర్మముగా ఉన్నప్పుడు ఎలా వుంది? ఒక విషయమును చెప్పితే దానినిబట్టి మిగతా ధర్మముల విషయము ఒక అంచనాకు వచ్చును. అందువలన మీకు తెలిసిన వాటిలో ముఖ్యమైన దానిని గురించి చెప్పండి.**

**జవాబు :-** ఈ ప్రశ్న అందరికీ అవసరమైనది. కావున ఈ జవాబును అందరూ గమనించవలసినదిగా యున్నది. భగవద్గీత గ్రంథములో అత్యంత ముఖ్యమైనది ఆత్మల విషయము. భగవద్గీతలో పద్నాలుగవ అధ్యాయము వరకు ఆత్మల కార్యములు చెప్పుచూ పోయిన భగవంతుడు పదిహేనవ అధ్యాయము వరకు ఆత్మలయొక్క వివరమును చెప్పలేదు. ఆత్మలు ఎన్ని ఉన్నాయను విషయము చెప్పకుండా ఆత్మలు చేయు పనులను పద్నాలుగవ అధ్యాయము వరకు చెప్పాడు. అయితే గ్రుడ్డిగా చదువు వారికి ఆత్మల మీద ధ్యాస వుండదు. హేతువాద దృష్టియున్న వానికి ఆత్మంటే ఏమిటి? ఆత్మలు ఎన్ని? అను ప్రశ్నరాగలదు. అటువంటి వారికి జవాబుగా పదిహేనవ అధ్యాయమయిన పురుషోత్తమ ప్రాప్తి యోగమను అధ్యాయమున 16, 17 శ్లోకములలో ఆత్మల విషయము చెప్పడము జరిగినది. 16వ శ్లోకమున లోకములో 'క్షరుడు', 'అక్షరుడు' అను ఇద్దరు పురుషులుగలరనీ, అందులో ఒకడు క్షరుడు, రెండవవాడు అక్షరుడని చెప్పడమైనది. దీనినిబట్టి పురుషులను వారిలో రెండు రకముల పురుషులుగలరని తెలిసిపోయినది.

అయితే ఆ ఇద్దరిలో ఒకడు క్షరుడుగా ఉన్నాడు. మరియొకడు అక్షరునిగా ఉన్నాడు. క్షరుడు అనగా నాశనమయిపోయేవాడని అర్థము. అక్షరుడు అనగా నాశనము కానివాడని అర్థముగలదు. అంటే ఒకటి ఎప్పటికయినా లేకుండా పోయేవాడని, రెండవవాడు ఎప్పటికీ ఎక్కడికీ పోకుండా నాశనము కాకుండా స్థిరస్థాయిగా ఉండునని తెలియుచున్నది. ఈ పురుషుల విషయము భగవద్గీతలో మొదటి అధ్యాయము నుండి చెప్పబడుచూ వస్తున్నా పదిహేనవ అధ్యాయము వరకు రెండు రకముల పురుషులున్నారని తెలియదు.

దీనికంటే ముందు పద్నాలుగవ అధ్యాయమైన గుణత్రయ విభాగ యోగమను అధ్యాయములో మొదటి మూడు, నాలుగు శ్లోకములందే పురుషుడు, స్త్రీ అను ఇద్దరి వలననే అందరూ పుట్టుచున్నారని చెప్పారు. అయితే అదేమీ క్రొత్త విషయము కాదు అని మనము అనుకోవచ్చును. ఇక్కడ విశేషమేమంటే మనకు ఇంతవరకు తెలియని విషయమునే అక్కడ చెప్పారుగానీ, తెలిసిన విషయమును చెప్పలేదు. ఎందుకనగా! ప్రపంచమున కంతటికీ ఒకే పురుషుడు, ఒకే స్త్రీయున్నట్లు అక్కడ చెప్పారు. కంటికి కనిపించని దేవున్ని పురుషుడని, కనిపించే ప్రకృతిని స్త్రీ అని చెప్పడము జరిగినది. స్త్రీ పురుషులచేత సంతతి కలుగుచున్నదను నమూనాను మనుషులయందు స్త్రీ పురుషులను ఏర్పరచి వారికి సంతతి కల్గునట్లు చేశారు. బయట కనపడు పురుషునితో సంబంధపడిన స్త్రీకి పురుషుని బీజము వలన సంతతి కల్గుచున్నదని అందరికీ తెలుసు. అయితే మనకు తెలియని జ్ఞానమును తెలుపు నిమిత్తము దేవుడు నిజమైన పురుషున్ని, నిజమైన స్త్రీని ఈ అధ్యాయములో పరిచయము చేశాడు. నిజమైన పురుషున్ని పురుషోత్తముడని పదిహేనవ అధ్యాయములో చెప్పాడు.

కనిపించే ప్రకృతి అను స్త్రీకి పురుషుడయిన దేవుడు బీజదాతగా ఉన్నాడనీ, దేవుని బీజము వలన ప్రకృతి గర్భము ధరించి సమస్త జీవరాశులకు పుట్టుకనిస్తుందనీ, అందువలన సమస్త జీవరాశులకు తల్లి ప్రకృతి కాగా, తండ్రి పరమాత్మయని చెప్పడమైనది. మనందరికీ తండ్రి పరమాత్మయని ఆయన మన శరీరములోనే కనిపించని ఆత్మగా ఉన్నాడనీ తెలియడమేకాక, ప్రకృతిచేత తయారయిన శరీరము స్త్రీతత్త్వము కలిగియున్నదని అర్థమయినది. ఒక మనిషిని జ్ఞానరీత్యా విడదీసి చూస్తే పంచభూత నిర్మాణమైన వాని శరీరము ప్రకృతియైన స్త్రీ తత్త్వముతో కూడుకొన్నదని, వానిలోపల గల చైతన్యము కనిపించని దేవునిగా ఉన్నాడని తెలియుచున్నది. ఈ విధముగా పదునాల్గవ అధ్యాయములోనే ప్రకృతి పరమాత్మలు స్త్రీ పురుషులుగా ఉన్నారని, ఒకే శరీరములో ప్రకృతి పురుషులు ఇద్దరూ ఉన్నారని తెలిసిపోయినది. ఇక పదిహేనవ అధ్యాయమైన పురుషోత్తమ ప్రాప్తియోగములో 16, 17 శ్లోకములందు పురుషుడయిన దేవున్ని విడదీసి చెప్పడమైనది. బాగా గమనించవలసిన విషయమేమనగా! ఈ శ్లోకములలో ఒక్క పురుషున్ని గురించే చెప్పడమైనది. స్త్రీ అయిన ప్రకృతిని గురించి ఏమాత్రము చెప్పలేదు. 17వ శ్లోకములో క్షరుడు, అక్షరుడను ఇద్దరు పురుషులేకాక మూడవ పురుషుడయిన వాడు ప్రత్యేకముగా ఉన్నాడనీ, అతనే పరమాత్మయని చెప్పబడుచున్నాడని శ్లోకములో గలదు. 'పరమాత్మ' అను మూడవ పురుషుడు క్షర, అక్షర ఇద్దరు పురుషులకంటే వేరుగా ఉండడమేకాక, వారికంటే ఉత్తమ పురుషుడుగా ఉండుట వలన ఆయనను పురుషోత్తముడని అనవలసి వచ్చినదని కూడా చెప్పారు. ఆ పురుషోత్తముడే సర్వలోకములకు దేవుడని కూడా చెప్పారు. ఇది 16,17 శ్లోకములలోగల సారాంశము, అక్కడ దేవుడు చెప్పిన సమాచారము అంతే

గలదు. అయితే ఆ శ్లోకములను చదివిన మనిషి మూడు ఆత్మలను అర్థము చేసుకోలేక, మూడు ఆత్మల విషయము తన బుద్ధికి గ్రహింపుకు రాకపోవడము వలన తప్పుగా అర్థము చేసుకోవడము జరిగినది. ధర్మమును వదలి అధర్మములోనికి పోయినట్లయినది.

భగవద్గీతలో ఆత్మల విషయము చాలా ముఖ్యమైన ధర్మముగా ఉన్నది. దేవుని ధర్మములన్నిటి పైకి ఉత్తమమైన ధర్మము, పెద్ద ధర్మము ఆత్మల వివరమేయని తెలియవలెను. అంత ముఖ్యమైన ధర్మమును దేవుడు అక్కడ తెలిపియుండగా, బోధకులు మొత్తము ఆ విషయమును అర్థము చేసుకోలేక పోయారు. మొదట ఒక బోధకుడు దానిని తప్పు భావముతో గ్రహించగా, మిగతా వారందరూ అతనినే అనుసరించి తప్పు భావములోనే పోయారు. మొత్తము మీద మూడువందల ఇరవై భగవద్గీతలలోనూ అక్కడున్న ధర్మమును అధర్మముగా మార్చి చెప్పడమైనది. ఇప్పుడు ఆ శ్లోకములను ఇక్కడ చెప్పుకొని చూస్తాము. వాటిలో ఏమాత్రము ప్రకృతి విషయమే ప్రస్తావనకు రాలేదు. ఉన్నదంతా ఆత్మల విషయమే గలదు. అటువంటప్పుడు ముగ్గురు పురుషుల స్థానములో ఒక ప్రకృతిని చేర్చి మిగతా ఇద్దరిని పురుషులుగా చెప్పారు. ప్రకృతియనగా స్త్రీతత్త్వము. స్త్రీతత్త్వమైన ప్రకృతిని పురుషులలో చేర్చడమూ, అక్కడ కేవలము ఇద్దరు పురుషులను మాత్రమే చెప్పి ఒక స్థానములో ప్రకృతిని చెప్పడము వలన అక్కడ దేవుడు చెప్పిన ధర్మము అధర్మముగా మారిపోయినది. మనుషులు చేసిన తప్పును ప్రత్యక్షముగా తెలియుటకు ముందు అక్కడగల శ్లోకములను మిగతా బోధకులు వ్రాసిన భావమును ఇప్పుడు చూస్తాము.

శ్లోకము 16 : ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే ॥

భావము :- ప్రపంచమునందు క్షరుడనియు, అక్షరుడనియు పేర్లుగల ఇద్దరు పురుషులు గలరు. బ్రహ్మాది స్థావరాంతము లగు శరీరముల సముదాయము క్షరము అనియు (నశించునదనియు), కూటస్థుడు చతుర్వింశాది తత్త్వముల కతీతుడగు జీవుడు లేక భగవన్మాయాశక్తి అక్షరుడని చెప్పబడుచున్నాడు.

శ్లోకము 17 : ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదా హృతః ।
యోలోక త్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

భావము :- నాశరహితుడైన ఏ ఈశ్వరుడు ముల్లోకములను ప్రవేశించి భరించుచున్నాడో, అట్టి క్షరాక్షరులకంటే వేరైన పురుషుడు, ఆ ఉభయులకంటే శ్రేష్ఠుడు, వాడే పరమాత్మ యని చెప్పబడుచున్నాడు.

(ఈ రెండు శ్లోకములు ఏర్పేడు ఆశ్రమము (చిత్తూరు జిల్లా) లో 1968 సంవత్సరమందు శ్రీమళయాలస్వాముల వారిచే వ్రాయబడిన "శ్రీ మద్భగవద్గీతా" అను గ్రంథమునుండి సేకరించి ఇక్కడ పొందుపరిచాము. ఒక విధముగా చెప్పితే ఆంధ్రరాష్ట్రానికి తెలుగులో భగవద్గీతను పరిచయము చేసిన వారిలో మలయాళ స్వాములవారు ముఖ్యుడు, మొదటివాడని చెప్పవచ్చును. అంతకు ముందు కొందరు వ్రాసినా అవి అన్నియు ప్రజల మధ్యలోనికి రాలేదు. ఎక్కువగా ప్రజల

మధ్యలోనికి వచ్చి బాగా ప్రచారమైన భగవద్గీతలలో ముఖ్యముగా మలయాళ స్వామివారి భగవద్గీతయేనని చెప్పవచ్చును. ఆంధ్రరాష్ట్రములో ఒకప్పుడు మలయాళస్వామి వారు బాగా ప్రచారములో ఉండెడివారు. ఆయన గొప్ప జ్ఞాని అని అందరూ చెప్పుకొనెడివారు. అంతపెద్ద స్వామీజీ చెప్పిన జ్ఞానమును అందరూ పూర్తిగా విశ్వసించెడివారు. ఆయన తర్వాత ఆయన శిష్యుడైన విద్యాప్రకాశానంద గిరి స్వాముల వారు "గీతామకరందము" అను పెద్ద భగవద్గీతను వ్రాసి ప్రచారము చేశారు. అన్నిటికంటే పెద్ద భగవద్గీత అయి నందున చాలామంది గీతామకరందమును కొని ఇంటిలో పెట్టుకొన్నారు. మలయాళ స్వామివారు బ్రాహ్మణులు కాగా, ఆయన శిష్యుడగు విద్యాప్రకాశానందగిరి స్వాములవారు వైశ్యులు అయినందున ఆర్యవైశ్య సంఘము వారు విద్యాప్రకాశానందగిరి స్వామి వ్రాసిన గీతామకరందమును ఎక్కువగా ప్రచారము చేశారు. పైన వ్రాసిన శ్లోకముల భావములు మలయాళ స్వాములవారు వ్రాసినవికాగా ఇప్పుడు క్రింద వ్రాయబోవు భావములు విద్యాప్రకాశానంద గిరి స్వాముల వారివని తెలుపుచున్నాము)

16వ. శ్లోకము యొక్క భావము :- సమస్త ప్రపంచమందు క్షరుడనియు, అక్షరుడనియు ఇరువురు పురుషులు గలరు. అందు సమస్త ప్రాణుల యొక్క దేహములు (ఉపాధులు) క్షరుడనియు, కూటస్థుడగు జీవుడు అక్షరుడనియు చెప్పబడుచున్నారు.

ప్రశ్న :- ఈ ప్రపంచమున పురుషులెందరు గలరు?

జవాబు :- ఇద్దరు కలరు. 1) క్షరుడు, 2) అక్షరుడు.

ప్రశ్న :- అందు క్షర పురుషుడెవడు?

జవాబు :- సమస్త ప్రాణుల యొక్క దేహములను క్షర పురుషుడని చెప్పబడును.

ప్రశ్న :- అక్షర పురుషుడెవడు?

జవాబు :- కూటస్థుడగు జీవుడు.

17వ శ్లోకము యొక్క భావము :- ఎవడు మూడు లోకములందు ప్రవేశించి వాటిని భరించుచున్నాడో, అట్టి నాశరహితుడును, జగన్నియామకుడును, పైన చెప్పిన ఇద్దరు పురుషులకంటే వేరయిన వాడును అయిన ఉత్తమ పురుషుడు పరమాత్మయని చెప్పబడుచున్నాడు.

ప్రశ్న :- ఈ క్షరాక్షరులకంటే వేరైన వాడు ఎవడైనా కలడా?

జవాబు :- కలడు.అతడే ఉత్తమ పురుషుడు (పురుషోత్తముడు)

ప్రశ్న :- పురుషోత్తము డెట్టివాడు?

జవాబు :- ముల్లోకములను భరించువాడు, జగన్నియామకుడు, నాశనరహితుడు.

ప్రశ్న :- కాబట్టి ఫలితాంశమేమి?

జవాబు :- క్షర (దేహ), అక్షర (జీవ) భావములను దాటి పురుషోత్తమ భావమును అవలంభించవలెను.

ఆంధ్రరాష్ట్రములో మంచి పేరున్న స్వాములు విద్యాప్రకాశానంద గిరి స్వాములవారు, ఆయన గురువుగారయిన మలయాళ స్వాములవారు. వీరు వ్రాసిన గీతామకరందము, శ్రీమద్భగవద్గీతా రెండు గ్రంథములు మంచి పేరుపొందిన గ్రంథములే. ఇప్పుడు వ్రాసి చూపించిన రెండు శ్లోకముల భావములు ఆ రెండు గ్రంథములలోనివే. ఇక్కడ వారు వ్రాసిన దానినిబట్టి క్షరుడు అనగా నాశనమగువాడని అర్థము. నాశనమగునది శరీరమే కావున శరీరమును క్షరుడని చెప్పారు. మరణించినప్పుడు శరీరము నశించినా, తాను నశించక వేరొక జన్మకు పోవు జీవున్ని అక్షరుడు అని అనుచున్నారని వ్రాయడము జరిగినది. వీరేకాదు చాలామంది వారు వ్రాసిన భగవద్గీతలలో కూడా ఇదే విషయమును తెలుపడమైనది.

16, 17 శ్లోకములను ఎలా పరిశోధించినా అక్కడ మూడు ఆత్మలను ముగ్గురు పురుషులని చెప్పారు. అందులో నాశనమయ్యేవాడు జీవుడని చెప్పక, నాశనమయ్యేది శరీరము అని అన్నారు. మరణములో నాశనమయ్యేది శరీరము. నాశనముకాని వాడు జీవుడు అనుమాట వాస్తవమే అయినా జీవుడు అక్షరుడు కాదు. జీవుడు చివరిలో ఎప్పుడయినా నాశనము కావలసినవాడే. జ్ఞానమును తెలిసిన జీవుడు కర్మరాహిత్యమును పొందినప్పుడు, కర్మలేని కారణమున జీవుడు నాశనమైపోయి దేవునిగా మారిపోవును. జీవుడు జీవునిగా నాశనమైనప్పుడు దేవునిగా మారిపోగలడు, అదే మోక్షము. ఒక జీవుడు గురువుకు నమస్కారము చేసి నాకు మోక్షమును ప్రసాదించమని కోరినప్పుడు గురువు **"నీవు నాశనమైపోనాని"** అని దీవించాడట. జీవుడు నశించితే దేవునిగా మారగలడని అదే మోక్షమని తెలుపు నిమిత్తము గురువు శిష్యున్ని అలాగ దీవించాడట. శరీరము ప్రకృతితో తయారయినది స్త్రీతత్త్వము గలది. ఇక్కడ రెండు శ్లోకములలో

చెప్పినది పురుషులను గురించేగానీ, స్త్రీ గురించికాదు. అలాంటప్పుడు స్త్రీతత్త్వమైన ప్రకృతిని ఈ శ్లోక భావములలో చెప్పడము పూర్తి తప్పగును. శ్లోకములలో ఎక్కడగానీ ప్రకృతి ప్రస్థావనే లేదు. పురుషుల గురించే యున్నది. ఈ రెండు శ్లోకముల భావములో పురుషుల గురించే చెప్పవలెను. అట్లుకాకుండా ప్రకృతితో తయారయిన దేహములను చెప్పడము వలన ప్రకృతిని చెప్పినట్లయినది. ఈ విధముగా పురుషుల స్థానములో పురుషులను గురించి చెప్పక స్త్రీని గురించి అనగా ప్రకృతిని గురించి చెప్పడము ధర్మ విరుద్ధమగును. ఇచటనే ధర్మము అధర్మముగా మారిపోవుచున్నది. బాగా పేరున్న స్వామీజీల గ్రంథములో జీవాత్మను గురించి చెప్పవలసిన చోట ప్రకృతి జనితమైన శరీరమును చెప్పడము పెద్ద పొరపాటు, తప్పు. అక్షర పురుషుడైన ఆత్మను గురించి చెప్పవలసినచోట జీవాత్మను చెప్పడము మరీ పెద్ద తప్పగును. అలా చెప్పడము వలన వెంటనే ఎవరికీ నష్టము రాదు, కష్టము రాదు. అయితే మనకు తెలియకుండానే ధర్మము అధర్మముగా మారిపోవును. ధర్మము యొక్క స్థానములో అధర్మము రావడము వలన దేవుని జ్ఞానము తెలిసినట్లేయుండును గానీ, దేవుని జ్ఞానము యొక్క దారి పూర్తి తెలియకుండా పోవును. దేవుని జ్ఞానము తెలియక పోవడము వలన దేవుడు తెలియకుండా పోవును. దేవుడు తెలిసినప్పుడే ముక్తి. ముక్తి వచ్చినప్పుడే దేవుడు తెలియును. అందువలన ముక్తిరాదు, దేవుడు తెలియ బడడు. దేవుడు చెప్పిన జ్ఞానమును సరిగా గ్రహించుకోని వాడు తనకు తెలిసినదే నిజమైన జ్ఞానమనుకొనుచుండును. అటువంటి వానికి దేవుడే దిగివచ్చి చెప్పినా అర్థము చేసుకోలేని స్థితిలోవుండును. అవగాహనా లోపమున్నప్పుడు ధర్మములు సులభముగా అధర్మమైపోవును.

**7, ప్ర :- దేవుడు చెప్పిన జ్ఞానమును అనగా దైవగ్రంథములలోని జ్ఞానమును సరిగా అర్థము చేసుకోవాలంటే ఏమి చేయాలి?**

**జవాబు :-** దేవుని మీద, దేవుని జ్ఞానము మీద శ్రద్ధను పెంచుకోవాలి.

**8, ప్ర :- దేవుని మీద శ్రద్ధ పెంచితే దైవగ్రంథములోని వాక్యములు మొదట తప్పగా అర్థమయినవి, రెండవమారు సరిగా అర్థమగునా?**

**జవాబు :-** ఒకమారు అర్థమయినది అలాగే ఉండును, తానంతటదే భావము మారదు. అయితే జ్ఞానము మీద శ్రద్ధ పెంచుకోగలిగితే ఇతరులు చెప్పు మాట సరియైనదనీ, అంతవరకు తనకు అర్థమయినది సరికాని అధర్మమని తెలియును. అప్పుడు అధర్మమునుండి ధర్మములోనికి మారుటకు అవకాశము గలదు.

**9, ప్ర :- ప్రస్తుత కాలములోనున్న మూడు మతములందు ఏ దానియందు ధర్మములు గలవు?**

**జవాబు :-** మూడు మతములందు ధర్మముల స్థానములో అధర్మములు ఉన్నాయి.

**10, ప్ర :- హిందూ మతములో అధర్మములు వచ్చి హిందువులలో చేరిపోయి, హిందువులు ఒక్క దేవున్ని మ్రొక్కక అనేక దేవుళ్ళను మ్రొక్కుచున్నారు. అట్లు కాకుండా ఒకే దేవున్ని విశ్వసించి, ఒకే దేవున్ని ప్రార్థన చేయు ముస్లీమ్‌లు ధర్మములో ఉన్నట్లే కదా! వారికున్న విశ్వాసము చలించనిది. అటువంటి విశ్వాసమున్నవారు ధర్మమును తెలిసినవారే కదా!**

**జవాబు :-** **విశ్వాసమునకు ధర్మమునకు సంబంధముండదు.** విశ్వాసము దేవుడు గొప్పవాడని చెప్పును. దేవుడు తప్ప ఇతరులెవరూ పెద్ద కాదు

అని చెప్పును. అన్నిటికీ మూలకారణము దేవుడని చెప్పవచ్చును. అంతేగానీ దేవుడు ఎలా గొప్పవాడో విశ్వాసము వలన తెలియదు. దేవుడు అందరికంటే గొప్పవాడు అని విశ్వాసము వలన చెప్పవచ్చునుగానీ, దేవుడు ఎలా పెద్దవాడో చెప్పలేము. వాటిలోని యదార్థము తెలియదు. ఈ విధముగా యదార్థ విషయము విశ్వాసము వలన తెలియబడదు. విశ్వాసము అనునది నమ్మకము మాత్రమే. జ్ఞానము అనునది నమ్మకము కాదు, యదార్థము. దేవున్ని గురించిన యదార్థము తెలియాలంటే ముందు శ్రద్ధ అవసరము. శ్రద్ధయున్నప్పుడు ఏదో ఒకరకముగా దేవుడు తన జ్ఞానమును తెలియ జేయును. అందువలన భగవద్గీతయందు భగవంతుడు **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** అని తన శ్లోకములో చెప్పాడు.

**11, ప్ర :- శ్రద్ధ కావాలంటే ఏమి చేయాలి?**

**జవాబు :-** శ్రద్ధలు రెండు రకములుగా ఉన్నవి. ఒకటి ప్రపంచ శ్రద్ధ, రెండవది పరమాత్మ శ్రద్ధ. ఈ రెండిటిలో ప్రపంచ శ్రద్ధ వాని కర్మనుబట్టి యుండును. పరమాత్మ మీద శ్రద్ధ కర్మాధీనములో ఉండదు. దైవశ్రద్ధను మనిషి ఎంతయినా పెంచుకోవచ్చును. దైవశ్రద్ధ మనిషి ఇచ్ఛమీద ఆధారపడి యుండును. అదే ప్రపంచ శ్రద్ధ అయితే మనిషి ఆధీనములో ఉండదు. మనిషి దేవుని విషయములో ముందుకు పోవాలని తలిస్తే ముందుకు పోగలడు. దానికి కావలసిన శ్రద్ధను మనిషి ఎంతయినా పెంచుకోవచ్చును. అది మనిషికి సాధ్యమయ్యే పనియే. ఎందుకనగా! దేవునిమీద శ్రద్ధ మనిషికి స్వయం హక్కుగా ఉన్నది. అందువలన మనిషి తాను దేవునిపట్ల లేని శ్రద్ధను పెంచుకోవచ్చును. అలాగే ఉన్న శ్రద్ధను లేకుండా చేసుకోవచ్చును. **ప్రపంచ శ్రద్ధ కర్మాధీనమైనట్లు పరమాత్మ మీద శ్రద్ధ జీవాధీనముగా**

**ఉన్నది.** శ్రద్ధ జీవుని ఆధీనములోగలది అయిన దానివలన దానిని జీవుడు ఎక్కువగా చేసుకోవచ్చును లేక తక్కువగా చేసుకోవచ్చును. పూర్తి లేని శ్రద్ధను తెచ్చుకోవచ్చును. పూర్తి ఉన్న శ్రద్ధను లేకుండా కూడా చేసుకోవచ్చును.

**12, ప్ర :- ప్రపంచ శ్రద్ధ కర్మనుబట్టి ఉండును కదా! అట్లే దైవశ్రద్ధ కర్మకు సంబంధములేదు అన్నారు కదా! మా అనుమానము ప్రకారము దైవశ్రద్ధ కాలమునుబట్టి ఉండునా? పూర్వము ఒకరకము ఇప్పుడు ఒకరకము ఏమయినా కలదా?**

**జవాబు :-** అలా ఉండుటకు వీలులేదు. కర్మ, కాలము ఒకదానికొకటి అవినాభావ సంబంధముగా ఉన్నాయి. ప్రపంచ విషయములో కర్మ ప్రకారము కాలము జరుగుచుండును. అదే దైవ విషయములో కర్మలేదు కావున కాలము కర్మానుసారము ఉండదు. పూర్వము మనిషికున్న శరీర భాగములే ఇప్పుడు మనిషికి కూడా ఉన్నాయి. పూర్వము లేనివి ఇప్పుడు ఉండడము, ఇప్పుడు లేనివి పూర్వము ఉండడము అంటూ ఏమీ లేదు. ఎప్పటికీ మానవ శరీర జీవిత వ్యవస్థ ఒకే విధముగా ఉన్నది.

**13, ప్ర:- పూర్వము నాగరికతలో వెనుకబడిన వారు నేడు కాలము జరిగి పోవు కొలది పూర్తి నాగరికులుగా తయారయినారు కదా! అలాగే పూర్వము ఆధ్యాత్మికములో వెనుకబడిన వారు ప్రస్తుత కాలములో ముందుకు పోయి అప్పుడు తెలియని ఆత్మ విధానమును ఇప్పుడేమయినా తెలియగలిగారేమో! మీరు చెప్పిన మలయాళ స్వామి, విద్యాప్రకాశానందగిరి స్వామి ఇద్దరూ పూర్వము ఉన్నవారే అయినా ఇప్పుడు వారులేరు. గతించిపోయిన వారు వెనుకటి కాలమున ఆధ్యాత్మికములో వెనుకబడియుండవచ్చును. ఇప్పటి**

**కాలములో ప్రస్తుతమున్న స్వామీజీలు ఎవరయినా సాధారణ మనిషి నాగరికతలో ముందుకు పోయినట్లు ఆధ్యాత్మికములో ముందుకు పోయివుండ వచ్చును కదా! వెనుక కాలములో ఎవరికీ తెలియని ఆత్మల విషయము మీరు చెప్పినట్లు మీ సమకాలికులయిన స్వామీజీలు ఎవరయినా మీతోపాటు ఆధ్యాత్మికములో ముందుకు పోయివుండవచ్చును కదా! ప్రస్తుత కాలములో ఎవరయినా భగవద్గీతకు భావము వ్రాసియుంటే దానిలో మీరు చూపిన రెండు శ్లోకములకు భావమును ఏమి వ్రాశారో కొద్దిగ తెలుపండి?**

**నా జవాబు :-** చూస్తుంటే నేను ఎంత బాగా వివరమును చెప్పితే, నీవు అంత బాగా ప్రశ్నను అడుగుచున్నావు. దేవుడు తనవారికి ఎదురాడని జ్ఞానమును ఇచ్చాను అన్నాడు. ఎవడు ప్రశ్నించినా దానికి జవాబు ఉండు నట్లు జ్ఞానమును ఇచ్చాడని దాని అర్థము. నీవు అడిగిన ప్రశ్నలో హేతుపద్ధతి ఉన్నది, కనుక నేను సులభముగా జవాబు చెప్పగలను. నేను ముందే "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమని" చెప్పియున్నాను. శ్రద్ధనుబట్టి జ్ఞానమని చెప్పానుగానీ, కాలమునుబట్టి జ్ఞానమని నేను చెప్పలేదు. ఏ కాలములో అయినా మనిషికున్న శ్రద్ధనుబట్టి జ్ఞానము లభించును.

నాగరికత విషయానికి వస్తే అది మనుషుల కర్మనుబట్టియుండును. కాలము గడచుకొలది నాగరికత పెరిగియుండవచ్చును, అయితే నాగరికత పెరుగుకొలది మనుషులలో జ్ఞానము పెరగలేదుగానీ, ఉన్న జ్ఞానము కూడా తగ్గిపోయినది. నాగరికతతోపాటు మనిషికి సుఖములు కూడా పెరిగాయి. అప్పుడు నడిచేవాడు ఇప్పుడు వాహనములో వేగముగా పోవుచున్నాడు. ఇట్లు అన్ని రంగములలో సుఖములు పెరిగాయి. దానితో మనిషి ధ్యాస సుఖాలవైపు పోయి జ్ఞానమువైపు లేకుండా పోయినది. పూర్వమున్న భక్తి, విశ్వాసములు ఇప్పటికాలములో మనిషియందులేవు అని చెప్పవచ్చును.

జ్ఞానము మనిషి శ్రద్ధనుబట్టియుండును. భక్తి విశ్వాసములు వేరు, శ్రద్ధ వేరుగాయున్నది. కాలము జరిగిపోవు కొలది భక్తి విశ్వాసములు పెరిగి యుండవచ్చును. అయితే జ్ఞానము మీద శ్రద్ధ తగ్గిపోయినదనియే చెప్పవచ్చును. మనుషులలో ఆ మార్పు బాగా కనిపిస్తున్నది. జ్ఞాన విషయములో బోధకులుగా, గురువులుగా చలామణి అగువారు పూర్వమున్న జ్ఞానమునే కలిగి, దానినే ప్రజలకు బోధిస్తున్నారు. కాలము జరుగుకొలది, నాగరికత పెరుగుకొలది జ్ఞానములో ఎటువంటి మార్పు రాలేదు. పురుషోత్తమ ప్రాప్తియోగములో 16, 17 శ్లోకములకు గతించిపోయిన స్వామీజీల భావములను చెప్పాము. అట్లుకాకుండా నేడు జీవించియున్న స్వామీజీలు ఆ శ్లోకములకు వ్రాసిన భావమును తెలుపమని అడిగారు. కనుక ప్రస్తుత కాలములో మంచి పేరు ప్రఖ్యాతులుగాంచిన స్వామీజీగారు వ్రాసిన జ్ఞానమును క్రింద తెలుపుచున్నాము చూడండి.

స్వామి సుందర చైతన్యానంద గారి పేరు ఆంధ్రప్రజలకు సుపరి చయమే. స్వామివారు ప్రతి నిత్యము ఉదయము టీ.వి ప్రసారాలలో కనిపిస్తూ తన బోధలను వినిపిస్తున్నాడు. ప్రస్తుతమున్న స్వామీజీలలో తన పని తను చేసుకొంటూ, తన జ్ఞానము తను బోధిస్తూ, ప్రశాంతముగా కాలము గడుపుచున్న పేరుపొందిన స్వామి సుందర చైతన్యగారు. సుందర చైతన్యస్వామీజీ పూర్తి కృష్ణ భక్తుడు, అందువలన ఆయనంటే అంతో ఇంతో నాకు అభిమానమే. ఈ మధ్యకాలములో అనగా 2010వ సంవత్సరము స్వామివారు తాను వ్రాసిన "చైతన్య భగవద్గీత"ను విడుదల చేయడము జరిగినది. ఆయన వ్రాసిన భగవద్గీత నాలుగు భాగములుగా వుండి 'గీతామకరందము' గ్రంథముకంటే సైజులో పెద్దగా ఉన్నది. దాదాపు రెండు వేల పేజీల గ్రంథముగా ఉన్నది. అంతగొప్ప గ్రంథములో కూడా

కాలము మారినా, మనుషులలో జ్ఞానము మారదని నిరూపించునట్లు రెండు శ్లోకముల వివరము గలదు. మీరు అడిగినట్లు ప్రస్తుత కాలములో జీవించి యున్న, మంచిపేరుగల స్వామీజీ వ్రాసిన భావమును క్రింద చూపుచున్నాము చూడండి.

(16వ శ్లోకమునకు వ్రాసిన వివరమంతయు క్రింద గలదు.)

(లోకములో పురుషులు ఇద్దరే ఉన్నారు. ఒకడు క్షరపురుషుడు, మరొకడు అక్షర పురుషుడు. సర్వభూతములు క్షరములు. కూటస్థుడు అక్షర స్వరూపుడు)

వ్యాఖ్య

లోకములో, అంటే సంసారములో సోపాధిక చైతన్యము ఇద్దరు పురుషులుగా చెప్పబడుతూవుంది. ఒకడు క్షర పురుషుడు, మరొకడు అక్షర పురుషుడు. కార్యోపాధి కలవాడు క్షర పురుషుడు కారణోపాధి కలవాడు అక్షర పురుషుడు.

క్షరము అంటే నశించేది కనుక నశించే కార్యోపాధికలవాడు క్షర పురుషుడు. అక్షర పురుషుడు అంటే దానికి భిన్నమైనవాడు, కారణోపాధి కలవాడు. కాల ప్రవాహములో నశించని ఉపాధి కారణోపాధి. అదే భగవంతున్ని ఆశ్రయించుకొనివున్న మాయాశక్తి, త్రిగుణ మిళితమైనది.

క్షరోపాధిగల కార్య పురుషునికి ఉత్పత్తి స్థానము కావడము చేత, అక్షరోపాధిగల కారణపురుషుడు లేదా మాయాశక్తి సంసారానికి బీజ భూతమైనది. క్షరోపాధిగల ఉత్పత్తి బీజము, సంసారులైన ప్రాణుల కామ కర్మాది సంస్కారాలకు అక్షర పురుషుడే ఆశ్రయ స్థానము.

## క్షర పురుషుడు

క్షరము అంటే నశించేది ఒక కాలములో కనిపించి మరొక కాలములో కనుమరుగయ్యేది. వికారయుతమైనది. కనుక సకలభూతాలు సర్వ కార్యములు, ఇవన్నీ నడవటానికి ఆశ్రయమైన దృశ్యమాన జగత్తు అంతా క్షరమే కనుక అది క్షర పురుషుడు. కార్యోపాధి కలవాడు అంటే కార్యరూప ప్రపంచముగా గోచరించేవాడు ఆద్యంతాలు కలిగి కార్యరూపములో గోచరిస్తూ వికారాన్ని పొందుతూ, వినాశనమయ్యే సర్వభూత శరీరాలు క్షర పురుషుని క్రిందికే వస్తాయి.

## అక్షర పురుషుడు

అనేక నామ రూపాలతో అనేక విధాలుగా ఏదైతే కార్యరూపములో గోచరిస్తూవుందో అట్టి వ్యక్త రూప ప్రపంచము క్షరము. వ్యక్తమయ్యే ఈ కార్యరూప జగత్తుకు కారణమై, ఏదైతే అవ్యక్తముగా ఉందో, అంటే వ్యక్తము కాకుండా ఉందో అదే అక్షరము. అవ్యక్తముగా ఉంటూ జగత్కార్యానికి కారణమైన మాయాశక్తియే అక్షరము. మార్పు లేనిది కూటస్థము.

కూటస్థము అనే పదాన్ని ఇక్కడ జాగ్రత్తగా అర్థము చేసుకోవాలి. అక్షర పురుషుడు, కూటస్థుడని చెప్పబడ్డాడు. పరబ్రహ్మమును కూటస్థమని, అక్షరమని ఇదివరకే మనం చెప్పకొన్నాము. ఇక్కడ మళ్ళీ మాయను కూటస్థం, అక్షరమ్ అని చెప్పుకొంటున్నాము. ఈ తేడాను స్పష్టముగా గ్రహించాలి.

పరబ్రహ్మము సర్వాధారమై, సర్వ వికారములకు ఆశ్రయమై తాను స్వరూపతః అవికార్యమై ఉండడము చేత కూటస్థమని చెప్పబడ్డాడు. దాగలి వలె కూటస్థుడని కూడా చెప్పకొన్నాము. కానీ ప్రస్తుతము అక్షరము, కూటస్థము అనే పదాలకు బ్రహ్మము అనే అర్థాన్ని గ్రహించడానికి వీలులేదు.

కార్యమైన జగద్రూపములో గోచరించే క్షర పురుషుడు కాల ప్రవాహములో కరిగిపోతాడు. వ్యక్తమయ్యే కార్యరూప క్షర పురుషునికి కారణమై అవ్యక్తముగా ఉండే మాయ ఇక్కడ అక్షరముగా, కూటస్థముగా చెప్పబడింది.

అక్షరము అంటే పరబ్రహ్మములాగా అవినాశి అని అర్థము కాదు. క్షరములాగా కాలములో నశించకుండా అవ్యక్తముగా ఉండి పునః సృష్టికి కారణమవుతూవుంది అని అర్థము. ప్రళయ కాలములో క్షర పురుషుడు నశించినా అవ్యక్తమైన మాయ నశించకుండా వుండి పునః జగత్కార్యానికి కారణము కావడము చేత అది సాపేక్షికముగా అక్షరమేగానీ, పారమార్థికము గా అక్షరమైన బ్రహ్మముకాదు. జ్ఞానోదయములో నశించే మాయ జ్ఞాన స్వరూపమైన పరబ్రహ్మములాగా అక్షరమెలా అవుతుంది?

అక్షరమెలాగో కూటస్థము అంతే. కూటమంటే మాయ అనీ, మోసమనీ, వక్రమనీ కుటిలత్వమని కూడా అర్థాలున్నాయి, మాయలో ఇవన్నీ ఉంటాయి. కనుక **అక్షరము, కూటస్థము అనే శబ్దాలు పరబ్రహ్మము ను సూచించేవే అయినా ఇక్కడ వాటిని మాయకు అన్వయించు కోవాలి.**

ఉపాధులు క్షరమైనా అక్షరమైనా అవి పరబ్రహ్మమునకు అన్యముగా ఉండలేవు. క్షరాక్షరాలు రెండూ పరమాత్మకు ఉపాధులే గనుక ఉపాధులను తొలగిస్తే కేవలము శుద్ధ చైతన్యమే అద్వయముగా శోభిస్తుంది. "తద్ధామ పరమం మమ" అని ఆరవ శ్లోకములో భగవంతుడు తెలిపింది ఇదే. ఇదికాదు, ఇదికాదు అని అన్నిటిని నిషేధిస్తూ, దానికంటే పరమైనది లేదు అని ఉపనిషత్తు దేనినయితే ప్రతిపాదించిందో అదే క్షరాక్షరాలకు విలక్షణమైన పరమాత్మ తత్త్వము.

పైన వ్రాసినదంతా సుందర చైతన్యస్వామి వారు వ్రాసినదే. మీకు ఏమి అర్థమయిందో ఏమోగానీ మాకు మాత్రము పరాయి భాషవారి మధ్య ఇరుక్కొని వారి భాషను కష్టముగా అర్థము చేసుకొన్నట్లున్నది. 16వ శ్లోకమునకు ఆయన వ్రాసినదంతా ఇక్కడ పొందుపరిచాము. స్వామివారు వ్రాసిన వ్రాతలో సర్వజీవుల శరీరములే అక్షర పురుషుడని చెప్పడమైనది. తర్వాత అక్షర పురుషున్ని వివరించి చెప్పుచూ గుణరూపమైన మాయగా అక్షరున్ని చెప్పడమైనది.

మలయాళ స్వామివారు ఆయన శిష్యుడయిన విద్యా ప్రకాశానంద గిరి స్వాములవారు క్షరపురుషున్ని శరీరములని వర్ణించి చెప్పినా, అక్షర పురుషున్ని మాత్రము జీవాత్మగా చెప్పారు. అదయినా ఒకరకముగా రెండవ వాడినయినా ఏదో ఒక పురుషునిగా చెప్పారు. ఇక్కడ సుందర చైతన్య స్వాములు చెప్పినది దీనికి పూర్తి భిన్నముగా ఉన్నది. రెండవ వానిని కూడా ఏదో ఒక పురుషునిగా చెప్పక, ప్రకృతి జనితమైన మాయను రెండవ స్థానములో పెట్టడము వలన అక్కడ కూడా స్త్రీ స్వరూపమును పెట్టినట్లయి నది. ముందు కాలములో 50 సంవత్సరముల క్రితము వ్రాయబడిన మలయాళ స్వామివారి గ్రంథములో ముగ్గురు పురుషుల స్థానములో ఇద్దరు పురుషులు నిలిచిపోగా ఒకటవ స్థానములో స్త్రీ స్వరూపమును చెప్పి చివరికి ఆ శ్లోకమును అధర్మ భావముగా మార్చివేశారు. ఇప్పటి కాలములో నాగరికత పెరిగి జ్ఞానము అభివృద్ధి అయిందను మీ మాట అసత్యముగా కనిపించుచున్నది. ప్రస్తుత కాలములో ఇంకనూ ఎక్కువగా అధర్మము పెరిగినదనుటకు సాక్ష్యముగా సుందరచైతన్య స్వాములు వ్రాసిన 16వ శ్లోకము యొక్క భావము ఇంకా కొంత చెడిపోయింది. ముగ్గురు పురుషుల స్థానములో ఇద్దరి స్త్రీలను నిలుపడమైనది. అందువలన గతకాలములో

చెప్పిన జ్ఞానముకంటే ఇప్పుడే మరీ అజ్ఞానముగా, అధర్మముగా జ్ఞానము తయారైనదని అర్థమగుచున్నది.

ఆ శ్లోకములో చెప్పినది ముగ్గురు పురుషులను గురించి అని ఎటు చూచినా అర్థమగుచున్నది. అటువంటప్పుడు సంస్కృత భాషను బాగా తెలిసిన మలయాళ స్వామి మరియు ఆయన శిష్యుడు విద్యాప్రకాశానంద గిరి స్వాములు నాశనమగువాడు జీవుడు అని చెప్పక, జీవున్ని నాశనముకాని ఆత్మగా అక్షరునిగా వర్ణించి చెప్పి, మూడవ పురుషునిగా పరమాత్మ అయిన దేవున్ని చెప్పి, చివరికి ఏ పురుషుడు దొరకక మొదటి క్షర పురుషుని స్థానములో ప్రకృతి సంబంధ దేహమును చెప్పారు. పద్నాలుగవ అధ్యాయమున ప్రకృతివేరు, పురుషుడు వేరని, ప్రకృతి స్త్రీ అనియు, దేవుడయిన పరమాత్మ పురుషుడనియు చెప్పిన మాటను మరచిపోయి, మొదటి పురుషుని స్థానములో ప్రకృతిని పెట్టి క్షరుడు శరీరమని చెప్పడము వలన, శ్లోకములో దేవుడు చెప్పిన ముగ్గురు పురుషులలో ఒక పురుషుడు మాయమైపోయినట్లయినది. అక్కడ చివరకు ఇద్దరు పురుషులే మిగిలి పోయారు. అది అటుండగా ప్రస్తుత కాలములో గొప్ప స్వామిగా పేరుగాంచిన సుందర చైతన్యస్వాముల వారు వ్రాసిన "చైతన్య భగవద్గీత"లో 16వ శ్లోకమునకు వ్రాసిన వివరమునంతటినీ చూస్తే, దేవుడు చెప్పిన ముగ్గురు పురుషులలో ఇద్దరు పురుషులు మాయమై కనిపించకుండా పోయి వారి స్థానములో **కనిపించే ప్రకృతి** అయిన శరీరము ఒకచోట, **కనిపించని ప్రకృతి** అయిన మాయ రెండవచోట పురుష స్థానమును ఆక్రమించుకొనుట చేత చివరకు మూడవ పురుషుడుగా దేవుడు ఒక్కడే మిగిలిపోయాడు. ఇక్కడ కూడా దేవుని మూడు ఆత్మల విషయములో ధర్మముపోయి అధర్మము వచ్చి చేరినది. ధర్మము అధర్మముగా మారుట మనిషి గ్రాహిత శక్తినిబట్టి

యుండును. దేవుడు చెప్పిన దానిని చెప్పినట్లు మనిషి గ్రహించుకొంటే ధర్మము ధర్మముగానే ఉంటుంది. దేవుడు చెప్పిన దానిని మనిషి తప్పుగా గ్రహించుకొంటే ధర్మము అధర్మముగా మారిపోతుంది. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయములో గల 16, 17 శ్లోకము లకు వివరము వ్రాసిన రచయితలందరూ తాము అర్థము చేసుకొన్న తప్పు భావమును వ్రాశారు. దానితో వాటిని చదివిన వారందరూ అధర్మమునే తెలుసుకొంటారు గానీ, ధర్మమును తెలుసుకోలేరు కదా! ఇట్లు లోకములో ధర్మముల స్థానములో కాలక్రమేపీ అధర్మములు వచ్చి చేరిపోవుచున్నవి. వాటిని సవరించుటకు దేవుడే వచ్చి ధర్మగ్లానిని నివారించి తిరిగి తన ధర్మములు ఇవేయని చెప్పవలసి వచ్చును. అందువలన దేవుడు **"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"** అన్నాడు. ఆ మాట ప్రకారము దేవుడు అవతరించి తిరిగి తన ధర్మములను తానే చెప్పిపోవలసి యున్నది. ధర్మసంస్థాపన నిమిత్తము వేరే ఎవ్వరూ వచ్చుటకు వీలులేదు. దేవుని ధర్మములు దేవునికే తెలియును కనుక, దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియవు కనుక దేవుని జ్ఞానమును దేవుడే చెప్పవలసియున్నది.

**14, ప్ర :- దేవుని గ్రంథములు మూడు అని చెప్పారు కదా! మూడు దైవ గ్రంథములలో దేవుని ధర్మములుండును కదా! ఒక్క గ్రంథములో ఒక్క మతము లో ధర్మములు అధర్మములుగా మారినా, మిగతా రెండు గ్రంథములను అనుసరించు వారియందు ధర్మములు మిగిలివుండును కదా! భూమిమీద ధర్మములకు ముప్పు ఏర్పడినప్పుడు నేను వచ్చి తెలియజేస్తానని దేవుడు చెప్పాడు. అయితే మూడు మతములలో ధర్మములు అధర్మములుగా మారినప్పుడు కదా దేవుడు రావలసియున్నది. హిందువులు విగ్రహారాధన చేయుచున్నారు. మేము ఏకేశ్వరోపాసన చేయుచున్నాము. దేవున్ని తప్ప ఎవరినీ ఒప్పుకోము**

**అని చెప్ప ముస్లీమ్‌లు సరియైన ధర్మములో ఉన్నట్లే కదా! అప్పడు ధర్మము భూమిమీద ఉన్నట్లే కదా! ఒక మతములో ధర్మములు మిగిలియున్నా ధర్మములకు గ్లాని లేనట్లే కదా! అటువంటప్పడు దేవుడు అవతరించి వచ్చి తిరిగి తన జ్ఞానమును చెప్పనవసరము లేదు క దా! దీనికేమంటారు?**

**జవాబు :-** భూమిమీద ధర్మగ్లాని ఏర్పడినప్పుడు నేను వస్తాను అన్నాడుగానీ, సంపూర్ణముగా లేకుండా పోయినప్పుడు వస్తానని దేవుడు చెప్పలేదు. ధర్మగ్లాని అనునది ఎక్కడ ఏర్పడినా దానిని సవరించుట దేవుని విధానముగా ఉన్నది. దేవుడు ఎప్పుడు వస్తాడనుటకు ఫలానా అప్పుడు వస్తాడు అని చెప్పగలరుగానీ, ఆ ఫలానా పరిస్థితి ఎక్కడున్నది అనునదే ముఖ్యమైన సమస్య. ఒక్క హిందూమతములో ధర్మములు లేకుండా పోయి, ఇస్లామ్ మతములో ధర్మములు భద్రముగా ఉన్నవా! అని చూడవలసియున్నది. అట్లే క్రైస్తవ మతములో ధర్మములకు ముప్పురాలేదా? అని చూడవలసియున్నది. ధర్మముల విషయములో ఒక మతమును సమర్థించుటకుగానీ, ఒక మతమును విమర్శించుటకుగానీ అవకాశము లేదు. ఎక్కడ ధర్మమునకు లోపమున్నా దానిని దేవుడు చూడగలడు. మనుషులమయిన మనము ధర్మముల విషయములో పొరపాటు పడి ధర్మములు ఉన్నచోట లేవని, లేనిచోట ఉన్నవని అనుకోవచ్చును. అయితే దేవుడు అలా అనుకోడు కదా! ధర్మములకు లోపము ఎక్కడ ఏర్పడినా అక్కడ అధర్మములున్నవని తెలియగలడు.

**15, ప్ర :- ధర్మములు ఏ స్థాయిలో తగ్గినప్పుడు దేవుడు అవతరిస్తాడు?**

**జవాబు :-** కనీసము 90 శాతము ధర్మములకు ముప్పు ఏర్పడినప్పుడు దేవుడు అవతరించి వాటిని పూర్తి స్థాయి ధర్మములుగా మార్చవలసియున్నది.

దేవుడు వచ్చి మాటలరూపములో చెప్పి ధర్మములను సరిచేయును. అంతేగానీ 10 శాతము అధర్మములుండి 90 శాతము ధర్మములున్నప్పుడు దేవుడు రావలసిన పనిలేదు.

**16, ప్ర :- ఇంతకుముందు హిందూమతము వారు అనుసరిస్తున్న భగవద్గీతలో ఒకచోట ఒకటి రెండు శ్లోకములకు భావము సరిగా లేదని అక్కడే అధర్మము పుట్టుచున్నదని చెప్పారు. భగవద్గీత ఎంతో పెద్దది, 700 శ్లోకాలతోనున్నది. అందులో ఒకటి, రెండు శ్లోకముల భావము సరిగా లేకపోయినంత మాత్రమున ధర్మములన్నిటికీ ముప్పవచ్చినట్లు కాదు కదా! మీమాట ప్రకారము 90 శాతము అధర్మములు వచ్చినప్పడే దేవుడు అవతరిస్తాడు అన్నారు. 90 శాతము అధర్మములు ఎప్పుడు కలుగుతాయి? దేవుడు ఎప్పుడు పుట్టుకొస్తాడు?**

**జవాబు :-** ఏది ధర్మము, ఏది అధర్మము అని తెలియని మనిషికి 90 శాతము ధర్మములు అధర్మములుగా ఎప్పుడు మారాయి అని చెప్పగలడు!! ధర్మముల విషయము పూర్తిగా ఏ మానవునికీ తెలియదు. అందువలన దేవుని రాకను ఎవడూ చెప్పలేడు. దేవుని ధర్మముల విషయములో నిర్ణయాధికారి దేవుడేయగుట వలన ధర్మములేవో అధర్మములేవో ఆయనే గుర్తించగలడు. మనిషికి ధర్మములను అధర్మములను గుర్తించు శక్తి లేదు. అందువలన ఏ బోధకుడు అధర్మమును చెప్పినా ఇది ధర్మమా కాదా!యని చూడకుండా దానిని నమ్మగలడు. అట్లే ధర్మమును చెప్పినా నమ్మగలడు. విన్నది ధర్మమా కాదా!యని చూచుకొను స్థోమత మనిషికి లేదు. అందువలన సులభముగా అధర్మములను ధర్మములని నమ్ముచున్నాడు. తాను నమ్మిన అధర్మములనే ధర్మములని వాదించుచున్నాడు.

**17, ప్ర :- అన్ని మతములలోను ఒకే స్థాయి ధర్మములున్నాయా? లేక ఒక్కొక్క**

**మతములో ఒక్కొక్క స్థాయి ధర్మములున్నవా? హిందూమతములో 100 ధర్మములుండి, క్రైస్తవ మతములో కొంత తక్కువగా 80 ధర్మములు, ఇస్లామ్ మతములో 70 గానీ లేక 90 గానీ లేక 100, 120 గాని ఉండవచ్చునా? మతమునకు ధర్మముల సంఖ్యలో వ్యత్యాసమున్నదా?**

**జవాబు :-** దేవుడు అందరికీ ఒక్కడేగావున ఏ మతములో అయినా ఒకే స్థాయి ధర్మములుండునుగానీ, మత మతమునకు వేరువేరు స్థాయి ధర్మములు ఉండవు. అన్ని మతములకు దేవుడు ఒక్కడే, ధర్మములు ఒక్కటే ఉండును.

**18. ప్ర :- హిందూ సమాజములో కొన్ని ధర్మములు మారాయి అని సాక్ష్యముగా భగవద్గీతలోని రెండు శ్లోకాలను చూపారు. గీతలోని రెండు శ్లోకాల వివరమే మారిందా? లేక భగవద్గీతలోని దేవుని భావములు మనుషులలో ఇంకా ఎక్కువగా మారాయా?**

**జవాబు :-** రెండు శ్లోకాల భావములు మారిపోయాయి అని మేము అంటున్నాము. సృష్ట్యాదిలో దేవుడు జ్ఞానమును చెప్పిన తర్వాత జ్ఞానమును ప్రజలందరూ తెలుసుకోగలిగారు. ఇది కృతయుగము మొదటిలోని మాట. తర్వాత రెండు యుగములు గడచిపోయాయి. దాదాపు 38, 80,000 సంవత్సరములు గడచిపోయినప్పుడు, అనగా ద్వాపర యుగము చివరిలో ధర్మములకు ముప్పు ఏర్పడినదని భూమిమీదికి దేవుడు భగవంతునిగా వచ్చి తిరిగి తన జ్ఞానమును చెప్పిపోయాడు. అలా చెప్పిపోయి దాదాపు 5150 సంవత్సరములు గడచిపోయినది. అయితే ఇంతకాలమునకు అక్కడక్కడా ధర్మములను మనిషి అధర్మములుగా అర్థము చేసుకొన్నట్లు తెలియుచున్నది. ఇది హిందూ సమాజము యొక్క చరిత్రకాగా, ఇక మిగతా మత సమాజముల విషయానికివస్తే ముస్లీమ్‌ల మతమును

పరిశీలిస్తే వారికి 1400 సంవత్సరములప్పుడే జిబ్రయేల్ ద్వారా దేవుని ధర్మములు తెలియబడినాయి. మొదట హిందువులకు దేవుడు చెప్పిన ధర్మములు పూర్తిగా తెలియుటకు, అందరూ అర్థము చేసుకొనుటకు, బహుశా ఏడు లేక ఎనిమిది వేల సంవత్సరములు పట్టియుండవచ్చును. అందరికీ దేవుని జ్ఞానము తెలిసిన తర్వాత అది 90 శాతము అజ్ఞానముగా మారుటకు, అధర్మములుగా మారుటకు దాదాపు 38 లక్షల 80వేల సంవత్సరముల కాలము పట్టినది. అంత కాలము జరిగిన తర్వాత తిరిగి ధర్మములకు ముప్పు ఏర్పడినది. అప్పుడు దేవుడు వచ్చి ధర్మ సంస్థాపన చేశాడు. ఇప్పుడు ఇస్లామ్‌మతములో జ్ఞానము చెప్పి కేవలము 1400 సంవత్సరములే అయినది. చెప్పిన జ్ఞానము వారికి తెలియుటకు ఎనిమిది వేల సంవత్సరములు పట్టును. అప్పటికి ధర్మములు వారికి అర్థము కాగలవనుకుందాము! తర్వాత కొన్ని లక్షల సంవత్సరములకు ధర్మములకుగ్లాని ఏర్పడవచ్చును. ఇప్పుడయితే వారు ప్రాథమిక దశలో ఉన్నారు. వారు దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలియుటకు హిందువులవలె ఏడు లేక ఎనిమిది వేల సంవత్సరములు పట్టునేమో! చెప్పలేము.

**19, ప్ర :- ఖుర్‌ఆన్ గ్రంథము అంతిమ దైవగ్రంథము కదా! అందులోవున్న జ్ఞానము ముస్లీమ్‌లకు తెలియదంటారా? వారు సంపూర్ణముగా నేర్చుకొనుటకు, తెలుసుకొనుటకు వేల సంవత్సరములు పట్టునంటారా?**

**జవాబు :-** దైవజ్ఞానము గ్రంథరూపములో కొన్ని వందల సంవత్సరముల క్రితమే వారివద్దకు వచ్చినది. అలా వచ్చిన జ్ఞానమును ముస్లీమ్‌లు తమ జ్ఞానమనుకొన్నారు. ఆ గ్రంథమును తమ గ్రంథమనుకొన్నారు. నేడు ముస్లీమ్ సమాజములోనున్న వ్యక్తులలో దాదాపు ఖురాన్ గ్రంథము అందరికీ

తెలుసు అయితే వారిలో సగము మందికిపైగా ఖురాన్ చదివియుండ వచ్చును. హిందువులు భగవద్గీతను గౌరవించుటకంటే ఎక్కువగా ముస్లీమ్‌లు ఖురాన్ గ్రంథమును గౌరవిస్తారు. దేవునికిచ్చిన విలువను ఖురాన్ గ్రంథముకిచ్చెదరు. ఎందుకనగా! అందులో అల్లాహ్ వాక్యములు గలవని వారి నమ్మకము. ఇస్లామ్ సమాజము 'విశ్వాసము' అను దానిమీద ఆధారపడి ముందుకు పోవుచున్నది. మనిషికి ప్రాథమికముగా దేవునిమీద విశ్వాసముండుట అవసరము. దేవునిమీద విశ్వాసములో ముస్లీమ్‌లు మొదటి స్థానమును సంపాదించారని చెప్పవచ్చును. ఎంతో విశ్వాసముతో యున్న ముస్లీమ్‌లు సగానికిపైగా ఖురాన్ గ్రంథమును చదివారు. చాలామంది గ్రంథములోని ఆయత్‌లను కంఠాపాటము చేసుకొన్నారు. కొందరు ఎంతో జ్ఞాపకశక్తి గలిగియుండి ఖురాన్ గ్రంథములో ఏ వాక్యము ఎక్కడున్నదో, ఏ ఆయత్ ఏ సూరాలో ఉన్నదో చూడకనే చెప్పగలుగు స్థోమతకల్గియున్నారు. ఆ విధముగా ఉన్నప్పటికీ గ్రంథములోని దేవుని ధర్మములు వారికి పూర్తి అవగాహనకు రాలేదని చెప్పవచ్చును. గ్రంథము లోని వాక్యములలో జ్ఞానము ఇమిడియుండును. అలావున్న జ్ఞానములో ధర్మములు ఇమిడియుండును. దేవుని ప్రతి వాక్యములోను ఒక ధర్మముండదు. కొన్ని వాక్యముల కూటమిలో ఒక ధర్మము ఇమిడి ఉండవచ్చును. ఒక ధర్మమును తెలియుటకు ఎంతో జ్ఞానమును తెలియవలసి యుండును.

దేవుని జ్ఞానమును గ్రంథములో చూచి చెప్పినా, చూడక చెప్పినా అందులో గ్రహించుకొన్న జ్ఞానము ముఖ్యముగానీ, జ్ఞాపకశక్తి ముఖ్యము కాదు. విశ్వాసము వలన దేవుడు గొప్పయని తెలియును. అట్లే మనిషిలోని దేవునిమీద శ్రద్ధ వలన దేవుని జ్ఞానము తెలియును. తెలిసిన జ్ఞానమును

బట్టి అందులో ధర్మమో అధర్మమోవుండును. గ్రంథములోని జ్ఞానము సరిగా అర్థమయితే అక్కడ మనిషికి ధర్మము తెలియబడును. సరిగా అర్థము కాకపోతే వేరుగా అర్థమయివుంటే దానినిబట్టి వానికి అధర్మము తెలియబడును. ఎప్పుడయితే దేవుని జ్ఞానమును మనిషి దేవుడు చెప్పిన భావము ప్రకారము తెలియగలుగునో అప్పుడు అతనికి దేవుని ధర్మము తెలిసిందని చెప్పవచ్చును. జ్ఞానము తెలియాలంటే మనిషికి దేవుని జ్ఞానము మీద శ్రద్ధవుండవలెను. **దేవుని జ్ఞానము మీద శ్రద్ధ లేకపోతే దేవుని ధర్మములు తెలియు అవకాశమే లేదు.** ప్రస్తుత కాలములో ముస్లీమ్‌లలో దేవుని జ్ఞానము మీద శ్రద్ధ తక్కువగా ఉండుటవలన దేవుని ధర్మములు ఇంకా పూర్తి తెలియవని చెప్పవచ్చును.

**20. ప్ర :- ముస్లీమ్ సమాజములో దేవునిమీద విశ్వాసము ఎక్కువగా ఉంది అని మీరే చెప్పారు కదా! దేవున్ని విశ్వసించిన వారికి దేవుని జ్ఞానము తెలియదంటారా?**

**జవాబు :-** ఈ విషయము మీకు అర్థమగుటకు చెప్పుచున్నానుగానీ, వాదించుటకుకాదు. భక్తి, శ్రద్ధలు అనునవి ప్రతి మనిషిలో ఉంటాయి. అయితే అవి ఉండే కొలతలు వేరువేరుగా ఉంటాయి. ముస్లీమ్‌లు విశ్వాసములో గొప్పవారని మేము ముందే చెప్పాము. భక్తి అంటే విశ్వాసము అని అర్థము. దేవునిమీద భక్తి (విశ్వాసము) ఉన్న వారందరికీ శ్రద్ధ ఉంటుందని చెప్పలేము. కారణమేమనగా! భక్తివేరు, శ్రద్ధవేరుగా ఉండడమే అని చెప్పవచ్చును. భక్తి, శ్రద్ధలు వేరువేరు. భక్తియున్నవానికి శ్రద్ధ యుంటుందని చెప్పలేము. శ్రద్ధయున్నవానికి భక్తి ఉండవచ్చు, ఉండకపోవచ్చు. ఇక్కడ చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. ఒకనికి ఆపిల్ పండంటే అమితమైన గౌరవము. గౌరవమున్నచోట భక్తి ఉంటుంది.

ఆపిల్ పండుమీద గౌరవమున్న దానివలన దానిమీద విశ్వాసము కూడా అతనికివుంది. ఆ విశ్వాసముతో ఆపిల్‌పండు గొప్పదనీ, దానితో ఏ పండు సాటిరాదనీ, దానిలో ఉన్నన్ని పోషక పదార్థములు ఏ పండులోనూ ఉండవనీ, చెట్టునుండి విడదీసిన తర్వాత కూడా అది చెడిపోక ఎన్ని రోజులయినా నిలువయుండుననీ, అట్లు ఏ పండు ఉండదని, ఆపిల్‌ను పొగడడమే అతను పనిగా పెట్టుకొన్నాడు. అట్లు ఆపిల్‌ను గొప్పగా చెప్పడము తప్ప దానిని తినవలెనను ఆలోచన అతనిలో లేదు. అయితే అతని స్నేహితుడు ఇతను చెప్పు మాటలన్నీ విని ఆపిల్ గొప్పదే అని ఒప్పుకొంటాడుగానీ అతనిలోపల దానిని తినవలెనని, దాని రుచిని అనుభవించవలెనని అనుకొనెడివాడు. వారిద్దరిలో ఆపిల్ పండుమీద విశ్వాసమున్న వాడు దానిని పొగడడము తప్ప ఏమీ చేయలేదు. అయితే వారిలో ఒకడు ఆపిల్‌ను తినాలనుకొన్నాడు. అందులోని రుచిని చూడాలనుకొన్నాడు. దాని పోషక పదార్థముల శక్తిని పొందాలనుకొన్నాడు. ఆ విధముగా ఆపిల్‌పండును ఇష్టపడినాడు. అతని ఇష్టము (శ్రద్ధ) ప్రకారము అతను ఆపిల్‌ను తిని దాని రుచిని చూచి, దాని శక్తిని పొందాడు. మిగతా వాడు ఆపిల్‌ను పొగడుచూ దాని గొప్పతనమును చెప్పుకొనుటకే పరిమితి అయ్యాడు. అలాగే దేవుని మీద భక్తి ఉన్నవాడు దేవున్ని పొగడుచూనే కాలము గడుపుచుండునుగానీ, దేవునిలోనికి ఐక్యము కావాలని, దేవుని శక్తిని పొందాలని అనుకోడు. దేవుని మీద శ్రద్ధయున్నవాడు మాత్రము దేవున్ని పొగడడము లేకుండా, దేవున్ని తెలియుటకు ప్రయత్నించుచుండును. దేవున్ని తెలిసి దేవుని శక్తిని పొందును. ఈ విధముగా దేవుని ఎడల భక్తి శ్రద్ధలుగలవు. దీనినిబట్టి **భక్తి కంటే శ్రద్ధ గొప్పదని తెలియుచున్నది.** దేవుని మీద భక్తియున్నవాడు భక్తుడు మాత్రమేయగును. శ్రద్ధయున్నవాడు యుక్తుడగును. యుక్తుడనగా కలిసినవాడని అర్థము. భక్తిగలవాడు

దూరముగా ఉండువాడేయగును. శ్రద్ధగలవాడు దూరముగా ఉండక కలిసిపోయిన వాడగును. దేవున్ని విశ్వసించిన వానికి దేవుడు గొప్పయని దేవుడు సృష్టికర్తయని, దేవునితో సమానమైనవారు ఎవరూలేరని, దేవుడు అందరికంటే గొప్పవాడని పొగడుటకు సరిపోవునుగానీ, స్వయముగా దేవున్ని తెలియలేరు! దేవుని శక్తిని పొందలేరు!!

**21, ప్ర:- పొగడ్తలకే పరిమితి కాకుండా దేవుని శక్తిని పొందాలంటే ముస్లీమ్‌లు ఏమి చేయాలి?**

**జవాబు :-** దేవుని మీద విశ్వాసముకంటే దేవున్ని తెలియవలెనను శ్రద్ధను పెంచుకోవాలి.

**22, ప్ర :- ఇప్పటినుండి మీరు చెప్పినట్లు నేను శ్రద్ధను పెంచుకొంటాను. నేను ముస్లీమ్‌నయినా విశ్వాసముకంటే శ్రద్ధనే ఎక్కువగా పెట్టుకొంటాను. అయితే నేను ఎంతకాలములో దేవున్ని తెలియగలను? దేవుని శక్తిని ఎంతకాలములో పొందుదును?**

**జవాబు :-** దేవుని విషయములో తొందరపడితే ప్రయోజనము లేదు. సృష్ట్యాదిలో దేవుడు మనుషులకు జ్ఞానమును అందించినప్పుడు అది ఒక్కమారుగా మనుషులను చేరలేదు. కృతయుగములో దేవుడు ఇచ్చిన జ్ఞానమును అర్థము చేసుకొనే దానికి దాదాపు ఎనిమిది వేల సంవత్సరములు పట్టింది. ఎనిమిది వేల సంవత్సరములకు ప్రజలందరూ సంపూర్ణ జ్ఞానులుగా మారిపోయారు. దేవుని జ్ఞానమును పొందిన మనుషులు తిరిగి అధర్మమును పొందుటకు 38,80,000 సంవత్సరములు పట్టినది. 38 లక్షల 80 వేల సంవత్సరములకు జ్ఞానులందరూ అజ్ఞానులుగా మారిపోయి అధర్మమును పొందినవారైనారు. మనుషులకు ధర్మములు

తెలియకుండా పోయినందుకు దేవుడు భగవంతునిగా (కృష్ణునిగా) వచ్చి రెండవమారు తన ధర్మములు తెలిపిపోయాడు. అలా తెలిపిన ధర్మములు జ్ఞానరూపముగా అర్థమగుటకు మొదటివలె దాదాపు ఎనిమిదివేల సంవత్సరములు పట్టును. దీని ప్రకారము భగవద్గీతను చెప్పి ఐదువేల సంవత్సరములయినా భగవద్గీతలో ఎంతో అర్థముకాని జ్ఞానమున్నది. భగవద్గీత హిందువుల స్వాములందరికీ అర్థమయినట్లు ఉన్నా దానిలో కొంత తప్ప అంతా అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఎలా అర్థము కాలేదో నమూనాగా పురుషోత్తమ ప్రాప్తియోగమను అధ్యాయములో 16వ శ్లోకమును గురించి చెప్పాము కదా!

సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమును రెండవమారు చెప్పి ఐదువేల సంవత్సరములయినా భగవద్గీతా జ్ఞానము నేటికీ హిందువులకు అర్థము కాలేదు. కేవలము 1400 సంవత్సరములప్పుడు చెప్పిన అంతిమ దైవగ్రంథము యొక్క జ్ఞానము అంత తొందరగా ఎలా అర్థము కాగలదు? భగవద్గీతను స్వామీజీలందరూ చదువుచున్నారు, బోధరూపములో బోధిస్తున్నారు. భగవద్గీత అంతా మాకు తెలుసు! అని అనుకుంటున్నారు. అయినా వారికి తెలియకుండా ఉన్నది ఎంతో గలదు. భగవద్గీతలో చాలా భాగము తెలియదనిన ఏ స్వామీజీలు ఒప్పుకోరు. అలాగే ఖురాన్ గ్రంథములోని ఆయత్‌లు సంపూర్ణముగా అర్థమగుటకు ఇంకా ఆరు లేక ఏడువేల సంవత్సరములు పట్టును. ఐదువేల సంవత్సరముల పూర్వము చెప్పిన భగవద్గీత సంపూర్ణముగా అర్థమగుటకు ఇంకా దాదాపు మూడువేల సంవత్సరములు పట్టవచ్చును. ఆ లెక్కప్రకారము 1400 సంవత్సరము లప్పుడు చెప్పిన ఖురాన్ గ్రంథములోని జ్ఞానము సంపూర్ణముగా అర్థమగు టకు కనీసము ఆరు లేక ఏడువేల సంవత్సరములు పట్టవచ్చును. అయితే

ఖురాన్‌ను బోధగా చెప్పు గురువులు, మతపెద్దలు మాకు ఖురాన్‌లో తెలియనిది లేదు అని వాదించగలరు. వాక్యములోనున్న దానిని సరిగా అర్థము చేసుకోలేకపోయినా, మాకు అంతా అర్థమయినదనియే చెప్పు చుందురు. అట్లు మాట్లాడు వారి నమ్మకము చెడిపోవునట్లు 'మీకు తెలియదు' అని చెప్పకూడదు. ఎందుకనగా! అతని ఉద్దేశ్యములో గ్రంథములో అర్థమయిన విధానమే సరియైనదని పూర్తి నమ్మియుండుటచేత ఎవరు ఏమి చెప్పినా వెనుతిరిగి చూచుకోడు. అప్పుడు అటువంటి వానిని నీవు తెలిసిన వాడివేనని మనము కూడా ఒప్పుకొని, అతనికి తెలియదిని మనకు తెలియు చున్న జ్ఞానమును గురించి మనకు తెలియనట్లు నటించుచూ, హేతుబద్ధముగా దానిని గురించి ప్రశ్నలను అడగాలి. అప్పుడు ప్రశ్నలకు జవాబు అతను చెప్పినా అవి సక్రమముగా లేవని అతనికి కూడా తెలిసి పోవును. మనము అడిగే ప్రశ్నలకు సరియైన జవాబులేక చెప్పుటకు ఇబ్బంది పడినప్పుడు అతనికి తెలిసిన దానిమీద అతనికే అనుమానము వచ్చును. అప్పుడు అతను నాకు తెలిసినది సరియైన జ్ఞానము కాదని అతనికే తెలిసిపోవును. ఆ విధముగా అయితే తెలియని దానిని తెలియదని ఒప్పుకోగలడుగానీ వేరు విధముగా ఎట్లు చెప్పినా, ఎవరూ ఒప్పుకోక నాకు తెలిసినదే సరియైన జ్ఞానమని అనుకొనుచుందురు. ఏది ఏమయినా ఒక్కమారుగా ఎవరికీ దేవుని జ్ఞానము అర్థముకాదు. దేవుడు తన జ్ఞానమును గ్రంథరూపముగా ఇస్తే, అది అన్ని విధములా ధర్మయుక్తముగా తెలియుటకు, అనగా దానిలోని ధర్మములను మనిషి సంపూర్ణముగా గ్రహించుకొనుటకు, కొన్నివేల సంవత్సరములు పట్టునని చరిత్రనుబట్టి తెలిసిపోయినది. సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము అటు ఇటు జరిగి దేవుడు చెప్పినది చెప్పినట్లు మనిషికి తెలియుటకు దాదాపు ఎనిమిదివేల సంవత్సరములు పట్టిన

కారణమున రెండవమారు దేవుడు తన జ్ఞానమును గ్రంథరూపము చేసి ఇచ్చాడు. అలా ఇచ్చిన జ్ఞానము మూడు గ్రంథముల రూపముగా నేడు మనముందరున్నది.

**23, ప్ర :- దేవుని జ్ఞానము అర్థమగుటకు అంతకాలము పట్టునా? అది నిజమేనా?**

**జవాబు :-** గుంతలో పడినవాడుగానీ, బావిలో పడినవాడుగానీ అందులో నుండి బయటపడుటకు కొంతకాలమే పట్టును. నది చెరువులో పడినవాడు దానిని ఈది బయటికి వచ్చుటకు బావినుండి వచ్చిన దానికంటే ఎక్కువ సమయము పట్టును. అలాగే సముద్రములో పడినవాడు బయటపడాలంటే నెలలు, సంవత్సరములు పట్టవచ్చును. ఈ విధముగా చెప్పితే దేవుని జ్ఞానము సముద్రములాంటిది. ఈదే కొద్దీ సముద్రమున్నట్లు, తెలుసుకొనే కొద్దీ జ్ఞానముండును. దేవుని జ్ఞానము ప్రపంచ జ్ఞానములాంటిది కాదు. ప్రపంచ జ్ఞానము అంతా ప్రత్యక్షముగా ఉండును. ఎంతపెద్ద జ్ఞానము నయినా తొందరగా తెలియవచ్చును. అయితే పరమాత్మ జ్ఞానము స్థూలముగా యుండక చాలా భాగము సూక్ష్మముగా ఉండును. అందువలన దేవుని జ్ఞానము తొందరగా ఎవరికీ అర్థముకాదు. అందువలన పూర్వము కొన్ని వేలసంవత్సరములు పట్టింది. అదే పద్ధతి ప్రకారము దేవుడు ఎప్పుడు తెలియజేసినా అది మనుషులకు పూర్తిగా అర్థమగుటకు పూర్వమువలె అంతే కాలము పట్టవచ్చునని చెప్పుచున్నాము.

**24, ప్ర :- దేవుని జ్ఞానము ఇంత భాగము స్థూలముగా ఉన్నదని, ఇంత భాగము సూక్ష్మముగా ఉన్నదని కొంతవరకు చెప్పవచ్చునా? అలా చెప్పటకు ఆధారమేమయినా ఉన్నదా?**

**జవాబు :-** ఇంతే స్థూలము, ఇంతే సూక్ష్మమని చెప్పుటకు అధారము గలదు.

ముందే ఇది జ్ఞాన విషయము. ఆధారము లేకుండా ఎవరూ మాట్లాడ కూడదు. దేవుడు సృష్టించిన మానవుడు పది భాగములు స్థూలముగా, పదిహేను భాగములు సూక్ష్మముగాయున్నాడు. శరీరములో తక్కువ ప్రాధాన్యతగల పది భాగములయిన కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు మాత్రము స్థూలముగా ఉన్నవి. మిగతా ఎక్కువ ప్రాధాన్యతగల పదిహేను భాగములు కనిపించని సూక్ష్మముగా యున్నవి. మొత్తము మానవ దేహము 25 భాగములుండగా, పది స్థూలముకాగా పదిహేను సూక్ష్మముగా ఉన్నట్లు తెలియుచున్నది. మనిషి శరీరములోనే దేవుడు చెప్పిన జ్ఞానమంతయు ఇమిడియున్నదని తెలియుటచేత మనిషి శరీరమునకు, దేవుడు చెప్పిన జ్ఞానమునకు అవినాభావ సంబంధమున్నదని తెలియుచున్నది. మనిషి శరీరమును అనుసరించి దేవుని జ్ఞానమును ఇంతే స్థూలము, ఇంతే సూక్ష్మము అని చెప్పవచ్చును. దానిప్రకారము మనిషి శరీరములో స్థూలము పది భాగములుగా ఉన్నట్లు, దేవుని జ్ఞానము కూడా పదింతలు స్థూలముగా ఉన్నది. అట్లే మనిషి శరీరము పదిహేను భాగములు సూక్ష్మముగా ఉన్నట్లు దైవ జ్ఞానముకూడా పదిహేను భాగములు సూక్ష్మముగాయున్నదని చెప్పవచ్చును. మనిషి శరీరమును 25 భాగములుగా విభజించినట్లు దైవ జ్ఞానమును కూడా 25 భాగములుగా చెప్పితే రెండింతలు స్థూలము, మూడింతలు సూక్ష్మముగా ఉన్నదని తెలియుచున్నది.

**25, ప్ర :- దేవుని జ్ఞానము ప్రస్తుత కాలములో మూడు మతములుగాయున్నది కదా! మూడు గ్రంథములుగా దేవుని జ్ఞానము ఉన్నది. మిగతా రెండు గ్రంథములలోని జ్ఞానము కూడా భగవద్గీతలోవలె స్థూలముగా, సూక్ష్మముగా ఉన్నదంటారా?**

**జవాబు :-** దేవుడు తన జ్ఞానమును మతములుగా విభజించి చెప్పలేదు. దేవుడు చెప్పిన జ్ఞానమును మనుషులు మతములుగా విభజించుకొన్నారు. ఎవరు ఎట్లు అనుకొనినా దేవుడు చెప్పిన జ్ఞానమంతా ఒక్కటే. దేవుడు మూడు కాలములలో, మూడు దేశములలో చెప్పిన జ్ఞానము ఒకే దేవుని జ్ఞానమయిన దానివలన ఒకే ధర్మములతో కూడుకొనియుండును. అందువలన భగవద్గీతలోయున్నట్లే మిగతా రెండు గ్రంథములందు కూడా అదే నిష్పత్తితో స్థూల, సూక్ష్మ జ్ఞానములన్నవని చెప్పవచ్చును. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా మూడు, ఆయత్ ఏడులో ఈ విధముగా గలదు. **(3-7) "నీపై ఈ గ్రంథమును అవతరింప చేసినవాడు దేవుడే. ఇందులో సుస్పష్టమైన స్థూల వాక్యములు ముహ్కమాత్ విషయములు గలవు. అవి గ్రంథానికి మూలము. మరికొన్ని బహువిధ భావములతో కూడుకొన్న సూక్ష్మ విషయములు కూడా కలవు. వాటిని ముతషాబిహాత్ వాక్యములు అని అంటాము"** అని గలదు. ఈ వాక్యము ప్రకారము భగవద్గీతలో యున్నట్లు స్థూల, సూక్ష్మ వాక్యములు ఖురాన్‌లో కూడా కలవని తెలిసిపోయినది. అదే విధముగా బైబిలు గ్రంథములో కూడా స్థూల, సూక్ష్మ జ్ఞానము కలదు.

**26, ప్ర:- హిందూమతములో రెండవమారు దేవుడు తన జ్ఞానమును ద్వాపర యుగము చివరిలో చెప్పినట్లు కలదు. అలా చెప్పి ఇప్పటికి ఐదువేల సంవత్సరములయినది. అయినా భగవద్గీతా జ్ఞానము పూర్తి ధర్మబద్ధముగా అర్థమగుటకు ఇంకా మూడువేల సంవత్సరములు పట్టవచ్చునని చెప్పుచున్నారు. గీతా జ్ఞానము అర్థము కాలేదనుటకు గుర్తుగా పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16, 17 శ్లోకములను చూపించారు. ఐదువేల సంవత్సరములయినా అందులోని భావము అర్థము కాలేదని తెలియుచున్నది.**

**అంతిమ దైవగ్రంథమును చెప్పి 1400 సంవత్సరములయినది. మీ లెక్క ప్రకారమైతే ఖురాన్‌లోని జ్ఞానము పూర్తి ప్రజల మధ్యలోనికి రావడానికి అది ధర్మయుక్తముగా ముస్లీమ్‌లందరికీ తెలియడానికి ఇంకా ఆరువేల సంవత్సరములు పట్టవచ్చునని తెలియుచున్నది. అయితే ఇప్పటికే చాలా మంది మతపెద్దలు, ఎందరో అల్లాహ్ భక్తులు ఖురాన్ చదివి బాగా జీర్ణింప జేసుకొన్నవారు కలరు. వారికి తెలిసిన ప్రకారము గ్రంథములో దేవుడు చెప్పినది మేము పూర్తిగా తెలుసుకొన్నాము అను భావములో ఉన్నారు. ఎవరి నమ్మకము వారికుండవచ్చును. దానిప్రకారము మేము సంపూర్ణ జ్ఞానులమని వారు ప్రకటించుకోవచ్చును. అందులో ఎవరి అభ్యంతరము లేదు. అయితే గతములో జరిగినట్లు విధానమును బట్టి దేవుని జ్ఞానము సులభముగా తెలియునది కాదు అని తెలిసిపోవుచున్నది. ద్వాపర యుగములో చెప్పిన జ్ఞానము కలియుగములో ఐదువేల సంవత్సరములు గడచినా సరిగా తెలియనప్పుడు, కలియుగములో 1400 సంవత్సరముల క్రిందట తెలిసిన జ్ఞానము కూడా మనుషులకు తెలియదనుటకు గుర్తుగా మీరు భగవద్గీతలో ఒక శ్లోకమును చూపినట్లు ఖురాన్ గ్రంథములో కూడా చూపవచ్చును కదా! అటువంటి వాక్యమును నమూనాగా ఒక్క వాక్యమును (ఒక్క ఆయత్‌ను) చూపమని అడుగుచున్నాము.**

**జవాబు :-** ఐదువేల సంవత్సరములు గడచినా భగవద్గీత అర్థము కాలేదని నిరూపించుటకు పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16వ శ్లోకమును మాత్రము చూపాము. హిందువులలో ఎంతో ఉద్ధండ పండితులు, గొప్ప స్వామీజీలు గలరు. వారందరూ భగవద్గీతలో జ్ఞానమంతయు సంపూర్ణముగా తెలిసి యున్నామను భావములో గలరు. అయినా వారి భావమునకు వ్యతిరేఖముగా మనుషులు ఇకా తెలియవలసిన ధర్మములను తెలుసుకోలేదని తెలుపుటకు

పురుషోత్తమ ప్రాప్తియోగములోని శ్లోకమును చూపాము. అలా చెప్పడము వలన దేవుని జ్ఞానము యొక్క గొప్పతనము, నిజస్థితిని తెలుపడమే మా ఉద్దేశ్యముగానీ, ఇతరులను కించపరచి మీరు జ్ఞానులు కాదు అని చెప్పడము మా ఉద్దేశ్యము కాదని తెలుపుచున్నాము. మనలో ఏ భావమయినా ఉండవచ్చును. మనలో ఉన్న భావములన్ని సరియైనవేనని మనము అనుకోవచ్చును. అందులో ఎవరి అభ్యంతరము లేదు. అయితే మనకున్న భావముతో దేవుని భావమును పోల్చి చూచుకోవడములో తప్పు లేదు కదా! అలాగే నేడు ముస్లీమ్‌లలో కూడా ఎందరో జ్ఞానులుగాయున్నవారు గలరు. అయితే వారి భావము వారి యెడల సరియైనదే కావచ్చును. అంతటితో ఆగక దేవుని భావముతో, దేవుని ధర్మముతో పోల్చి చూచుకోవడములో తప్పు లేదు. ఒకవేళ దేవుని భావములో మనుషుల భావము వేరుగా యున్నప్పుడు వాటిని సవరించుకొని దేవుని భావమును పొందుటకు అవకాశము గలదు కదా! దేవుని భావముతో మన భావము పోల్చిచూచు కోకపోతే, వాని తప్పును వాడు తెలుసుకోలేడు. అందువలన దేవుని వాక్యమును తీసుకొని ఒకటికి రెండుమార్లు చూచుకోవాలని చెప్పుచున్నాము.

భగవద్గీతను చెప్పి ఐదువేల సంవత్సరములయినా అది సగము కూడా అర్థముకాలేదు. అటువంటప్పుడు ఖుర్ఆన్ గ్రంథమును భగవద్గీతతో పోల్చి చూస్తే, అది వచ్చి చాలా తక్కువ కాలమయిన దానివలన, ఖురాన్‌లో చాలా భాగము అర్థము కాలేదని చెప్పుటకు అవకాశము గలదు. మీరు అడిగినది సాక్ష్యానికి ఒక ఆయత్‌ను చెప్పమన్నారు కదా! మీ మాట ప్రకారమే సూరా 2, ఆయత్ 187 తీసుకొని చూస్తాము. **(2-187) "ఉప వాస కాలములో రాత్రులందు మీరు మీ భార్యలను కలుసుకోవడము మీ కొరకు ధర్మ సమ్మతము చేయబడినది. మీ భార్యలు మీకు దుస్తులు, మీరు**

**మీ భార్యలకు దుస్తులు. మీరు రహస్యముగా ఆత్మద్రోహానికి పాల్పడు చున్నారనే సంగతి అల్లాహ్‌కు తెలుసు. అయినా ఆయన క్షమా గుణముతో మీ వైపుకు మరలి మీ తప్పుల మన్నించాడు. ఇకనుంచి మీరు మీ భార్యలతో ఉపవాస రాత్రులందు రమించటానికి, అల్లాహ్ మీ కొరకు వ్రాసి పెట్టిన దానిని అన్వేషించటానికి మీకు అనుమతి వుంది. తొలిజాములోని తెలుపు నడిరేయి నల్లని చారలోనుండి కనిపించే వరకు తినండి, త్రాగండి. ఆ తర్వాత వీటన్నిటిని వదలి రాత్రి చీకటి పడేవరకు ఉపవాసముండండి. ఇంకా మీరు మస్జిద్‌లలో "ఏతెకాఫ్" పాటించే కాలములో మీ భార్యలతో సమాగమం జరుపకండి. ఇవి అల్లాహ్ నిర్ధారించిన హద్దులు. మీరు వాటి దరిదాపులకు కూడా పోకండి. ప్రజలు అప్రమత్తముగా ఉండుటకు గాను అల్లాహ్ తన ఆయత్‌లను ఇలా విడమరచి చెప్పుచున్నాడు."**

ఈ వాక్యము (ఆయత్) సూక్ష్మజ్ఞానము కలది కాదు. ఇది స్థూల జ్ఞానము మాత్రమే. ఇది మనుషుల ప్రవర్తనను గురించి చెప్పునది. ఈ వాక్యము ఒక విషయమును గురించి చెప్పుచూ మొదలయినది. అదే విధముగా అదే విషయమును చివరివరకు చెప్పి ముగించడము జరిగినది. ఇక్కడ శరీర సంబంధ విషయమైన స్త్రీ పురుష సంభోగ విషయమును గురించి చెప్పడమైనది. ఇందులో విశేషము "స్త్రీలు పురుషులకు దుస్తులు, పురుషులు స్త్రీలకు దుస్తులు" అనుమాట గలదు. ఇది కొంత అర్థము కానిమాట అయినాగానీ దానిని విప్పి చెప్పుకోవచ్చును. దుస్తులు అనగా ధరించునవని అర్థము. శరీరమునకు ధరించువాటిని దుస్తులు అని చెప్పుదుము. స్త్రీ పురుషున్ని ధరించవచ్చు, పురుషుడు స్త్రీని ధరించవచ్చు అని ఇక్కడ తెలుపడమైనది. ఇందులో విశేషమేమంటే 'ఒక పురుషుడు తన స్త్రీవద్దకు (భార్యవద్దకు) తన ఇచ్ఛచేత ఎలా పోవుచున్నాడో, అలాగే

ఒక స్త్రీ తన పురుషునివద్దకు (భర్తవద్దకు) తన ఇచ్ఛ కల్గినప్పుడు పోవచ్చును' అని చెప్పడమే ఇందులో విశేషత. దీనినిబట్టి స్త్రీ పురుషుని వద్దకయినా పోవచ్చును, అలాగే పురుషుడు స్త్రీవద్దకయినా పోవచ్చునని తెలియు చున్నది. స్త్రీ, పురుషులు ఒకరినొకరు రమించడములో (శారీరకముగా కలుసుకోవడములో) సమాన హక్కు దారులని తెలియుచున్నది. ఒకరికొకరు దుస్తులు అని చెప్పడములో అంతే అంతరార్థము గలదు. స్త్రీ పురుషుల సంభోగ విషయమును గురించి పవిత్ర దినములయిన రంజాన్ నెలలో దేవుడు ధర్మసమ్మతమైన విధానమును చెప్పాడు. ఆ విధానము ప్రకారము పగలుపూట రమించడము చేయకూడదని రాత్రి సమయములో మాత్రమే ఆ పనిని చేసుకోమని చెప్పడమైనది.

వివరముగా అర్థమగుటకు ఇలా చెప్పుచున్నాము. పూర్వము రోగములు వస్తే దానికి ఎక్కువగా ఆయుర్వేద చికిత్సమీద మనుషులు ఆధారపడేవారు. ఆయుర్వేద మందులు వాడితే తప్పనిసరిగా కొన్ని ఆహార పదార్థములు తినకూడదు. అందరికీ తెలిసినట్లు నేడు కూడా కామెర్ల రోగమునకు ఏ మందులు వాడినా మాంసము ఏమాత్రము తినకూడదు. కామెర్ల రోగమున్నప్పుడు మాంసము తింటే మరణము తప్పదను విషయము అందరికీ తెలుసు. పూర్వము ఆయుర్వేద మందులు వాడేటప్పుడు పత్యము తప్పనిసరిగా చెప్పేవారు. పత్యము అనగా తినకూడనివి, వాడకూడనివి, చేయకూడనివి అని మూడు రకములు గలవు. మూడు రకములను 'పత్యము' అను ఒకే పదముతో పిలువడము జరుగుచున్నది. కామెర్లకు మాంసము తినకూడదు. జ్వరము వచ్చినప్పుడు చన్నీటి స్నానము చేయకూడదు. క్షయ (టి.బి) రోగము, గుండెజబ్బు ఉన్నప్పుడు 'పడక పత్యము' తప్పనిసరిగా ఉండవలెను. 'పడక పత్యము' అను మాట ఈ కాలములో క్రొత్తగా

కనిపించినా పూర్వము సర్వసాధారణముగా ఈ పదమును చెప్పెడివారు. ఈ పదమునకు వివరము అందరికీ తెలిసియుండెడిది. పడక పత్యము అనగా భార్య భర్తతో కలువకూడదు (రమించకూడదు) అట్లే భర్త భార్యతో కలువకూడదు. ఖురాన్ గ్రంథములో ఈ విషయమును చెప్పుచూ "రాత్రిపూట తినండి, త్రాగండి. పగటిపూట ఉపవాసముండండి" అన్నారు. ఉపవాసము అనగా పత్యము అని అర్థము. ఉప+వాసము=ఉపవాసము ఉప అనగా ప్రక్కనే గల నివాసమని అర్థము. ప్రతిరోజు ఉన్నట్లు కాకుండా వేరొక విధముగా ఉండడమని అర్థము. సాధారణ సమయములో రమించేవానివి రోగ సమయములో ఉపవాసము (పత్యము) ఉండవలెను. అట్లే సాధారణ సమయములో తినేవానివి రోగసమయములో ఉపవాసము (పత్యము) ఉండవలెను. సాధారణ సమయములో స్నానము చేసేవానివి రోగ సమయములో ఉపవాసము (పత్యము) ఉండవలెను అని చెప్పడములో అప్పుడు ఏది అవసరమో దానిని వదలివేయడమని అర్థము. ఇక్కడ పవిత్ర దినములలో పవిత్రతే అవసరము అందువలన సూరా 2, ఆయత్ 187లో భార్యాభర్తలు రమించు విషయమును పత్యమని చెప్పారు. అక్కడ చెప్పినది పడకపత్యమయితే మనుషులు అర్థము చేసుకొన్నది 'పదార్థ పత్యము.' ఆహార పత్యమును గురించి చెప్పవలసిన సందర్భమే ఆ వాక్యములో లేదు. ఆ వాక్యములో మొదటిలోను ముగింపులోనూ పడక పత్యమే కనిపిస్తావుంది. తెలివున్నవారు బాగా గమనించి చూస్తే అక్కడ ఆహార పత్యమును గురించి ఏమాత్రము చెప్పలేదని అందరికీ తెలిసిపోవును. అయితే దేవుడు చెప్పని విషయమును మనుషులు అర్థము చేసుకొని అందరూ దేవుడు చెప్పిన భావమును వదలి ప్రక్క భావములోనికి పోయారు. ఈ విషయమును తిరిగి అల్లాహ్ చెప్పవలసిందేగానీ మేము చెప్పడము వలన ప్రయోజనము

లేదని మాకు తెలుసు! అయినా అల్లాహ్ ప్రేరణతోనే సత్యమును వ్రాయవలసి వచ్చినది. స్త్రీ పురుషులు కలుసుకొను సమయము రాత్రియేనని పగలుకాదని అదియే సరియైన సమయమని సాధారణముగా అందరికీ తెలుసు. అదే విషయమునే దేవుడు కూడా పవిత్ర దినములలో పద్ధతిగా ఉండమని పద్ధతి తప్పి నడువవద్దని చెప్పాడు. ఈ వాక్యములో చెప్పినదొకటయితే మనిషి అర్థము చేసుకొన్నది మరొకటి కదా! ఈ వాక్యము అర్థము కాలేదనీ, ఈ విధముగానే అనేక వాక్యములు అర్థము కాలేదని తెలియుచున్నది. ఖురాన్ సంపూర్ణముగా దేవుని దయవలన కొన్ని వేల సంవత్సరములకయినా అర్థము కాగలదు.

**27, ప్ర :- ఇప్పుడు మీరు చెప్పినది దేవుని జ్ఞాన విషయమా, ప్రపంచ జ్ఞాన విషయమా?**

**జవాబు :-** ఒక విధముగా ప్రపంచ జ్ఞానవిషయమేనని చెప్పవచ్చును. మానవుల రతిక్రీడ దైవ విషయముకాదు, ప్రపంచ విషయమే అగును. ఖురాన్ గ్రంథములో కొన్ని ప్రపంచ నీతికి సంబంధించిన స్థూల విషయములు, దేవుని జ్ఞానమునకు సంబంధించిన సూక్ష్మ విషయములు రెండూ గలవు. ప్రపంచ నీతికి సంబంధించిన స్థూల విషయములలోనికే 187వ ఆయత్ చేరిపోతుంది. మనిషి జీవన విధానమును గురించిన ఎన్నో విషయములు ఖురాన్ గ్రంథములో గలవని ముస్లీమ్‌లందరికీ తెలుసు. దేవుని జ్ఞానము మనిషికి ఎంత అవసరమో, జీవన విధానము కూడా అంతే అవసరమను ఉద్దేశ్యముతో ప్రవక్తగారు ఈ విషయములను చెప్పియుండ వచ్చును.

**28, ప్ర :- నేను ఒక ముస్లీమ్ స్త్రీని ప్రశ్నించుచున్నాను. దేవుని జ్ఞానమునకు స్త్రీ**

**పురుష సంభోగ విషయములకు ఏమి సంబంధము? స్త్రీ పురుషుల కలయిక విషయము కేవలము ప్రపంచ విషయమగును కదా! అలాంటప్పుడు జిబ్రయేల్ ఈ విషయములను చెప్పియుండునా? ఖురాన్‌లో కేవలము జిబ్రయేల్ చెప్పిన విషయములే ఉన్నాయా? జిబ్రయేల్ చెప్పితే దేవుని జ్ఞానమునే చెప్పాలి కదా!**

**జవాబు :-** జిబ్రయేల్ ఆకాశమునుండి దిగివచ్చి తనకు తెలిసిన దేవుని జ్ఞానమును ప్రవక్తగారికి చెప్పిపోయాడు. మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ ఆకాశములో 'వహీ' ద్వారా తనకు తెలిసిన జ్ఞానమును ప్రవక్తగారికి చెప్పాడు. జిబ్రయేల్ చెప్పినది దేవుని జ్ఞానమేగానీ, అందులో ప్రపంచ జ్ఞానము ఏమాత్రము లేదు. జిబ్రయేల్ తనకు తెలిసిన జ్ఞానము అప్పుడు కొంత, అప్పుడు కొంత ప్రవక్తగారికి చెప్పుచూవచ్చాడు. ఒక్కమారుగా జిబ్రయేల్ జ్ఞానమునంతటినీ చెప్పలేదు. 23 సంవత్సరములుగా చెప్పుచూ వచ్చాడు. జిబ్రయేల్ ప్రణాళిక ప్రకారము 25 సంవత్సరముల కాలము తనకు తెలిసిన జ్ఞానమునంతటినీ చెప్పవలసియుండగా 23 సంవత్సరములు మాత్రమే చెప్పాడు. ఇది మా అంచనా ప్రకారము చెప్పు మాటగా గ్రహించవలెను. ఇంకనూ రెండు సంవత్సరములు జిబ్రయేల్ జ్ఞానమును చెప్పవలసి యుండగా ప్రవక్తగారు ఆకస్మికముగా జబ్బు చేసి చనిపోవడము జరిగింది. అందువలన ఇంకా తెలియవలసిన జ్ఞానముండగా ప్రవక్తగారి మరణముతో మనము కొంత కోల్పోయామనియే చెప్పవచ్చును. ప్రవక్తగారు చనిపోయిన తర్వాత కొంత కాలమునకు ఖురాన్ గ్రంథమును వ్రాయడము జరిగినది. అయితే ఖురాన్ గ్రంథములో జిబ్రయేల్ చెప్పిన జ్ఞానవాక్యములే కాకుండా, మనిషి (ముస్లీమ్) జీవించు జీవన విధానమును గురించి కూడా వ్రాయడము జరిగినది. ప్రవక్తగారు చనిపోయాడు గనుక ప్రవక్తగారికి గానీ, జిబ్రయేల్ గారికిగానీ ఖురాన్‌లో ఏ విషయములున్నది తెలియదనియే చెప్పవచ్చును.

జిబ్రయేల్ చెప్పిన జ్ఞాన వాక్యములన్నియు ఖుర్ఆన్ గ్రంథములో గలవు. అయితే వాటితోపాటు సామాజిక జ్ఞానము కూడా కలదని చెప్పవచ్చును. స్థూల విషయములని (ముహ్కామాత్ విషయములు) ఏవి చెప్పబడినవో అవన్నియు సామాజిక జీవన విధానమును గురించిన నీతి వాక్యములేయని తెలియవలెను. దీనిప్రకారము ఖురాన్ గ్రంథములో దేవుని జ్ఞానవాక్యములు గలవు. ప్రపంచ సంబంధ నీతి వాక్యములు గలవు. ఎవరికి కావలసినవి వారు అందులోనుండి తీసుకోవచ్చును. మేము ఖురాన్ గ్రంథములోని జ్ఞానవాక్యములను మాత్రము గ్రహించి నీతివాక్యములను వదలివేయు చున్నాము.

**29, ప్ర :- నేను మిమ్ములను గీతలో ఒక శ్లోకమును చెప్పి అది ఎలా అర్థము కాలేదో చెప్పమన్నాను కదా! అటువంటప్పుడు మీరు ఖురాన్‌లోని సూక్ష్మ జ్ఞాన వాక్యమును మనుషులు ఎలా అర్థము చేసుకోలేదో చెప్పక, స్థూలమైన ప్రపంచ విషయమును గురించి చెప్పారు? నేను అడిగినది ఒకటి, మీరు చెప్పినది మరొకటి.**

**జవాబు :-** మీరు అడిగినది భగవద్గీతలోవలె అర్థము కాని వాక్యమును ఖురాన్ నుండి తీసి చెప్పమన్నారు. ఖురాన్‌లో ఒకరకముగా వ్రాసియుండగా, మనకు మరోరకముగా అర్థమయినదని తెలుపు నిమిత్తము (2-187) వాక్యమును తీసి చెప్పాము. ఖురాన్ గ్రంథము దైవగ్రంథము. అందులో కొన్ని ప్రపంచ వాక్యములు కలిసినా, దానిని దైవగ్రంథమనియే చెప్పగలము. బియ్యములో కొన్ని రాళ్ళు కలిసినా వాటిని బియ్యమనియే అంటాము. అలాగే అంతిమ దైవగ్రంథములో కొన్ని సామాజిక విషయములున్నా దానిని దైవగ్రంథమనియే చెప్పుచున్నాము. బియ్యములో రాళ్ళను వేరుపరచి

బియ్యమును మాత్రము తిన్నట్లు, ఖురాన్ గ్రంథములోని సామాజిక విషయములను వదలి కేవలము జ్ఞాన విషయములను మాత్రము స్వీకరించ వచ్చును. అదే విధముగా మేము గతములో వ్రాసిన ఖురాన్ గ్రంథమునకు **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అని పేరు పెట్టాము. అందులో సామాజిక విషయములను ప్రక్కనపెట్టి కేవలము జ్ఞానవాక్యములకు మాత్రమే వివరము వ్రాయడము జరిగినది. ఇప్పుడు మీరు ప్రత్యేకించి జ్ఞానవాక్యముల ఎడల ప్రజల అవగాహన ఎట్లుందో చెప్పమన్నారు. సూక్ష్మమైన జ్ఞానమును ఎలా సరిగా అర్థము చేసుకోలేక పోవుచున్నామో వాటిని గురించి చెప్పుకొందాము.

ఖురాన్ గ్రంథములోని వాక్యములను ముందే (3-7) ఆయత్‌లో రెండు రకములుగా వర్ణించి చెప్పాడు. అందులో ఒకరకము స్థూలమైన ముహ్కమాత్ వాక్యములనీ, సూక్ష్మమైన ముతషాబిహాత్ వాక్యములని చెప్పడమే కాక ముతషాబిహాత్ వాక్యములు జ్ఞానముతో కూడుకొన్నవని చెప్పడమైనది. జ్ఞానముతో కూడుకొన్న వాక్యముల వివరము దేవుడు చెప్పితేనే అర్థమవునని కూడా చెప్పాడు. ఆ మాటతోనే స్థూలమైన వాక్యములలో జ్ఞానములేదని, వాటి వివరమును సాధారణ మనుషులు కూడా చెప్పుకోవచ్చని తెలిసి పోయింది. ఇంతకుముందు మనము చెప్పుకొన్న స్త్రీ పురుషుల సంగమ విషయము స్థూలవిషయమని అందులో నీతి తప్ప జ్ఞానములేదని తెలిసిపోయినది. **"నీతి లోక సంబంధము, జ్ఞానము దైవ సంబంధమను"** సూత్రము ప్రకారము లోక సంబంధమైన వాక్యములను వదలి, జ్ఞాన సంబంధమైన వాక్యములనే చూచుటకు ముందు ఆ రెండు వాక్యములకు మధ్యలో యున్న తారతమ్యములను కొద్దిగ గమనిద్దాము. సూరా రెండులో 187వ ఆయత్‌ను చూచాము కదా! అక్కడే

గల 186వ వాక్యమును వివరించుకొని చూస్తాము. **(2-186) " ఓ ప్రవక్తా! నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే, నేను వారికి అత్యంత సమీపములో ఉన్నాననీ, పిలిచేవాడు నన్ను ఎప్పుడు పిలిచినా నేను అతని పిలుపును ఆలకించి ఆమోదిస్తానని నువ్వు వారికి చెప్పు. వారు కూడా నా ఆదేశాన్ని శిరసావహించాలి. నన్ను విశ్వసించాలి. తద్వారానే వారు సన్మార్గ భాగ్యము పొందగలుగు తారు."**

ఈ వాక్యము పూర్తి సూక్ష్మమైన జ్ఞానముతో కూడుకొన్న వాక్యమని తెలిసిపోవుచున్నది. దేవుడు మనకు అత్యంత సమీపుడని చెప్పాడు. దేవుడు ఏ విధముగా అతి దగ్గరగా యున్నాడో మనకు తెలియదు. దేవుడు కనిపించు వాడు కూడా కాదు. ఇదంతా సూక్ష్మమైన జ్ఞాన విషయమని సులభముగా తెలిసిపోవుచున్నది. ఈ విధముగా బయటికి కనిపించని విషయమును సూక్ష్మమైన జ్ఞానవిషయముగా చెప్పుకోవచ్చును. ఇది 186వ వాక్యముకాగా, ప్రక్కనే 187వ వాక్యము పూర్తి బయటికి తెలియు ప్రపంచ విషయముగా ఉన్నది. ఒకే సూరాలో ప్రక్కప్రక్క వాక్యములలో ఒకటి పరమాత్మ సంబంధముకాగా, మరొకటి ప్రపంచ సంబంధముగా ఉన్నది ఈ విధముగా యున్న వాక్యములను ఖురాన్ గ్రంథములో అనేకచోట్ల చూడవచ్చును. కొన్నిచోట్ల నూటికి 80 వాక్యములు ప్రపంచ సంబంధముగా ఉండగా, 20 వాక్యములు దైవ సంబంధముగా ఉండును. ముందు మనము ఒక సూత్రమును చెప్పుకొన్నాము. దాని ప్రకారమైతే రెండు భాగములు స్థూల జ్ఞానముండగా, మూడు భాగములు సూక్ష్మ జ్ఞానము ప్రతి దైవ గ్రంథములోను గలవు.

ఇప్పుడు నీవు అడిగినట్లు సూక్ష్మమైన జ్ఞాన విషయమును మనుషులు ఎలా అర్థము చేసుకోలేదో వివరిస్తాను చూడండి. సూరా ఆరు, ఆయత్

95 ను చూస్తాము. **(6-95) "నిస్సందేహముగా విత్తనాన్ని టెంకను చీల్చేవాడు అల్లాహ్‌యే. ఆయన జీవమున్న దానిని జీవము లేనిదానిలో నుండి తీస్తాడు. జీవము లేనిదానిని జీవమున్న దానిలోనుండి తీసేవాడు ఆయనే. ఆయనే అల్లాహ్ (దేవుడు). మరలాంటప్పుడు మీరు సత్యము నుండి ఎటు మరలిపోతున్నారు?"** ఈ వాక్యము ఖురాన్ గ్రంథములో అత్యంత సూక్ష్మమైన జ్ఞానముతో కూడుకొన్న దైవవాక్యమని చెప్పవచ్చును. ఈ వాక్యము అర్థముకావాలంటే తప్పక 6,600 సంవత్సరములు పట్టునని చెప్పక తప్పదు. ఈ వాక్యము భగవద్గీతలో సాంఖ్యయోగమున 22వ శ్లోకమందు సూచన ప్రాయముగా కలదు. ఖురాన్‌లో ఉన్నట్లు భగవద్గీతలో లేకపోయినా కొంత భాషాభేదముతో యున్నమాట వాస్తవమే!

ఈ వాక్యమును ముస్లీమ్‌లందరూ బాగా తెలిసినట్లే చెప్పుకొనుచుందురు. సంపూర్ణముగా దాని భావము తెలిసినట్లు చెప్పుకొనుచుందురు. వారికి తెలిసిన వివరమును సులభముగా చెప్పుచుందురు. అయితే ఈ వాక్యమునకు అర్థము ఇంతవరకు అధర్మముగానే అర్థమయినదని, ధర్మ బద్ధముగా తెలుసుకోవాలను విషయమును పూర్తి మరచిపోయారు. వారి నమ్మిక ప్రకారము తాము తెలిసినవారమే! అని అనుకొంటున్నారు. ఇక్కడ మనము ముందు తెలుసుకోవలసిన విషయమేమనగా! ఇది జన్మలకు సంబంధించిన విషయమని తెలిసినా ఒక మనిషిలోని జీవుడు ఎక్కడి నుండి వచ్చి శిశువుగా పుట్టుచున్నాడో తెలియదు. జీవుడు కనిపించు వాడు కాదు. పుట్టే శరీరము కనిపించినా ఇది స్థూలవాక్యము కాదు. ఇది అత్యంత కీలకమైన సూక్ష్మవాక్యమని తెలియుచున్నది. భూమిమీద అనగా ప్రపంచములో మూడు రకముల జన్మలు గలవు. వాటినే వరుసగా **అండజ, పిండజ, ఉద్భిజములని** చెప్పుచుందురు. గ్రుడ్డునుండి పుట్టు వాటిని

అండజములని అంటాము. అలాగే పిండమునుండి (తల్లి గర్భము నుండి) పుట్టువాటిని పిండజములంటాము. విత్తనమునుండి పుట్టు వాటిని ఉద్భిజములని అంటాము. ఈ మూడు రకముల పుట్టుకలు అందరికీ తెలిసినవే. ఈ మూడు రకములలో ఏది ఎలా పుట్టుచున్నదో, పుట్టు సమయములో ఏమి జరుగుచున్నదో ఎవరికీ తెలియదు.

ఒక్క మనుషుల విషయమును గమనించితే మనుషులు తల్లిగర్భము నుండి పుట్టుచున్నారని అందరూ చెప్పుచున్నారు. ఇక్కడ మనము కొంత తెలియవలసినది ఉన్నది. గర్భములో పెరుగునది పిండము, పిండములో పుట్టునది పిండజము అని అంటున్నాము. ఈ లెక్క ప్రకారము చూస్తే గర్భమునుండి పుట్టుచున్నాము అనుమాట అసత్యమని, పిండమునుండి పుట్టుమాట సత్యమని చెప్పవచ్చును. మనుషులమైన మనమందరము పిండమునుండి పుట్టినవారమే. అయితే ఒకేఒక్కడు మాత్రము గర్భము నుండి పుట్టువాడు గలడు. అతనిని గురించి తర్వాత చెప్పుకొందాము. పిండజము తర్వాత గ్రుడ్డునుండి పుట్టు పక్షులు, బల్లులు, కప్పలు మొదలగునవి అన్నియు అండజములనియే చెప్పవచ్చును. ఇక్కడ అందరికీ కనిపించు సత్యము ఒకటి గలదు. అదేమనగా! ప్రాణములేని గ్రుడ్డునుండి ప్రాణమున్న పక్షి పుట్టుచున్నదని అందరికీ తెలుసు. జీవము లేని గ్రుడ్డు నుండి జీవమున్నది పక్షిగానీ, పాముగానీ పుట్టుచుండుట కొన్నిచోట్ల కొందరు చూచియే ఉందురు. అందువలన ఖురాన్ గ్రంథములో 6-95 వాక్యములో **"జీవములేని దానినుండి జీవమున్నది పుట్టుచున్నదని"** చెప్పినట్లు గలదు. వాక్యములో **"జీవమున్న దానిని జీవము లేనిదానినుండి తీస్తాడు"** అని ఉన్నది. ఇక్కడ జీవమున్నది అనగా పుట్టుకతోనే జీవముగలదని అర్థము. గ్రుడ్డు జీవములేనిదానిగా ఉండును. అలా జీవము లేనిదిగా యున్న

గ్రుడ్డు నుండి సజీవముగా పక్షి పుట్టుచున్నది కదా! అందువలన పై వాక్యములో 'జీవమున్న దానిని జీవము లేని దానినుండి తీస్తాడు' అని చెప్పడమైనది. ఈ మాట సత్యమే అని అందరూ ఒప్పుకోగలరు. ఎందుకనగా! ఇది కనిపించు సత్యముగాయున్నది. కావున ఈ మాటకు ఎవరూ ఆటంకము చెప్పరు.

పిండజ విషయములోనికి వస్తే **"జీవము లేని దానిని జీవమున్న దానినుండి తీసేవాడు ఆయనే"** అని వాక్యములో కలదు. అయితే ఈ వాక్యమును ఎవరూ నమ్మకుండాయున్నారు. ఎందుకనగా! తల్లిగర్భము నుండి పుట్టే శిశుశరీరము సజీవముగా పుట్టుచున్నదని అందరూ అనుకోవడము జరుగుచున్నది. అయితే అలా పుట్టడము అసంభవమనీ, అది జరిగే పనికాదని తెలిసిపోవుచున్నది. అలా గర్భమునుండి ఎవడయినా పుట్టితే వానిని "గర్భజ" అని అనవచ్చునుగానీ, "పిండజ" అని పిలువకూడదు. అయితే మనమంతా పిండమునుండి పుట్టినవారమే. సజీవమైన తల్లి శరీరమునుండి నిర్జీవమైన శిశుశరీరము పుట్టుచున్నది. అయితే ఇది కూడా కనిపించు విషయమే అయినా చాలామందికి ఈ విషయము తెలియకుండా పోయినది. మనకు తెలిసినా తెలియకపోయినా ఉన్న సత్యము అంతే! కావున పై వాక్యములో **"జీవము లేనిదానిని జీవమున్న దానినుండి తీసేవాడు దేవుడేయని"** చెప్పారు. పై వాక్యములో ఉండే ధర్మము అదే అయినా అందులోని ధర్మమును మనిషి వాక్యమునుండి గ్రహించలేకున్నాడు. అందువలన 6-95వ వాక్యము అర్థముకాని స్థితిలో నిలిచిపోయినది. ఈ వాక్యమును చాలామంది వేరు విధముగా అర్థము చేసుకొని అధర్మమునే గ్రహించారు. వాక్యములోయున్న ధర్మమును గ్రహించలేకపోయారు. ఈ వాక్యములోని ధర్మము సంపూర్ణముగా

తెలియాలంటే మేము వ్రాసిన **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథమును చదవండి.

ఈ వాక్యమును చాలామంది బోధకులుగాయున్న ముస్లీమ్‌లు, మత పెద్దలుగాయున్న ముస్లీమ్‌లు చదివేయున్నారు. ఈ వాక్యమును సూరా, ఆయత్ నంబర్‌ను చెప్పడమేకాక, ఫలానా పేజీలో యున్నదని పేజీ నంబరుతో సహా చెప్పు ముస్లీమ్ పండితులు గలరు. అదంతా జ్ఞాపకశక్తికి సంబంధించిన విషయము. జ్ఞాపకశక్తియున్న వారివద్ద జ్ఞానశక్తియున్నదను నమ్మకము లేదు. అందువలన జ్ఞాపకశక్తితో సులభముగా వాక్యమును చెప్పు వారికి కూడా ఇది ధర్మబద్ధముగా అర్థముకాలేదని చెప్పవచ్చును. ఒకమారు కొందరు ముస్లీమ్ పెద్దలు తమ మతములోనికి చేరమని, ఇస్లామ్ మతములో ఎంతో జ్ఞానమున్నదని, మీరు ఇస్లామ్ మతమునకు చాలా దగ్గరగా ఉన్నారని అందువలన ఇస్లామ్‌లో చేరుటకు చాలా యోగ్యులుగా ఉన్నారని చాలా రకములుగా మమ్ములను మతమార్పిడి కొరకు ఒకప్పుడు వైజాగ్‌లో ప్రేరేపించారు. అప్పుడు నేను ఇలా మాట్లాడినాను, వారు నా మాటలను పూర్తిగా విన్నారు. "నేను హిందూమతములో పుట్టినా నాకు అన్ని మతములు సమానమే. అయితే ఈ మధ్య కాలములో ఖురాన్ గ్రంథములోని వాక్యముల గురించి నాకు తెలిసినంత వివరముగా చెప్పు చుండుట వాస్తవమే. అంత మాత్రమున ఖురాన్ గ్రంథములోని అన్ని విషయములకు వివరము తెలియదు. అందులోని జ్ఞానము నాకు పూర్తి తెలిసినప్పుడు నేను అందులోనికి వస్తే బాగుంటుంది. అలా ఏమీ తెలియ నప్పుడు ఆ మతములోనికి నేను వస్తే, ఎవరయినా ఒక వాక్యమునకు వివరము అడిగితే దానికి వివరము చెప్పాలి కదా! అప్పుడు ఆ వివరము తెలియకపోయి జవాబును చెప్పలేకపోతే నాకు మర్యాద పోయినట్లగును.

హిందూమతములోయుండి ప్రతి ప్రశ్నకు జవాబును చెప్పు నేను అక్కడ జవాబు చెప్పలేకపోతే గౌరవానికి లోపము ఏర్పడును. అందువలన నేను ఖురాన్ గ్రంథములో నాకు తెలియని వాక్యములను పూర్తిగా తెలుసుకొని తర్వాత మీ మతములో చేరగలను" అని అన్నాను అప్పుడు వారు "మీకు ఎక్కడ ఏమి తెలియదో మమ్ములను అడగండి మేము మీకు వివరముగా చెప్పుతాము అంతే కదా!" అని అన్నారు. దానికి నేను (6-95) వాక్యమునే అడిగాను, దానికి వారు సంపూర్ణముగా తెలిసిన వారివలె వివరమును వారు ఎన్ని విధముల చెప్పాలని ప్రయత్నించినా, మళ్ళీమళ్ళీ ప్రశ్నించడము వలన వారు చివరకు మాకు తెలియదు, మా పెద్దలను అడిగి చెప్పుతామని చెప్పడమైనది.

ఆ దినమున చెప్పిన వారిలో ఇద్దరు ముఖ్యముగా చెప్పారు. వారు ఇద్దరు ఎలా చెప్పారో చూడండి. మొదట జవాబు చెప్పినవారు ఇలా అన్నారు. "కోడిని గమనిస్తే కోడికి ప్రాణమున్నది. ప్రాణమున్న కోడినుండి ప్రాణము లేని గ్రుడ్డు పుట్టుచున్నది కదా! అందువలన వాక్యములో జీవమున్న దానినుండి జీవము లేనిది పుట్టుచున్నదని గ్రుడ్డును గురించి చెప్పారు. అట్లే ప్రాణములేని గ్రుడ్డునుండి ప్రాణమున్న కోడిపిల్ల పుట్టుచున్నది కదా! అందువలన జీవములేని దానినుండి జీవమున్నది పుట్టుచున్నదని చెప్పారు" అని చెప్పారు. ఖుర్ఆన్‌లో వుండే రెండు విధానముల జన్మలను ఒకే కోడివద్ద సరిచేశారు. అయితే దేవుడు వాక్యములో మూడు విధానములను చెప్పియుండగా, వారు చెప్పిన రెండు విధానములు ఒకే అండజములకు సరిపోవును. వారి లెక్కలో పిండజము లేకుండా పోయినది. దానికి నేను ఒప్పుకోలేదు. ఎన్నో ప్రశ్నలను వేయగా దానికి వారు సమాధానము చెప్పలేదు.

మరియొకరు మాట్లాడుచూ ఇలా వర్ణించి చెప్పారు. గ్రుడ్డునుండి కోడిపిల్ల రావడము ప్రాణము లేనిదానినుండి ప్రాణమున్నది పుట్టుకొచ్చినట్టని చెప్పి, రెండవది ఎలా చెప్పారనగా జీవమున్న దానినుండి జీవము లేనిది పుట్టుచుండుట వాస్తవమే. జీవమున్న మనిషినుండి జీవము లేని మలము వస్తున్నది కదా! అట్లే జీవమున్న శరీరమునుండి జీవములేని ఎంగిలి, మూత్రము, చెమట ఇవన్నియూ వస్తున్నవి కదా! అని సమాధానము చెప్పారు. అతనిని కూడా ప్రశ్నలడుగగా చివరికి ఏమీ చెప్పలేకపోయాడు. దేవుడు ఎంతో ఉన్నతమైన తన జ్ఞానమును ధర్మబద్ధముగా చెప్పితే, మనుషులు దానిని ఏమాత్రము సరియైన విధానముగా తెలియలేకపోవుచున్నారని తెలిసి పోయినది. దేవుడు 6-95వ వాక్యములో తన మూడు రకముల సృష్ఠి విషయమును వాక్యము రూపములో చెప్పితే, అది పెద్ద జ్ఞాన రహస్యమని తెలియక ఎవరికిష్టమొచ్చినట్లు వారు అర్థము చేసుకోవడము జరిగినది. అలా అర్థము చేసుకొన్నవారు మనకు తెలిసినది, మనకు అర్థమయినది సరియైన జ్ఞానమో, కాదోయని ఏమాత్రము వెనుతిరిగి చూచుకోవడము లేదు. ప్రతి ఒక్కరు తమకు అర్థమయినదే నిజమైన జ్ఞానమని అనుకొంటున్నారు. దేవుని సృష్ఠి భూమిమీద మూడు విధములుగా ఉన్న దని తెలిపిన వాక్యమును మనిషి సరిగా అర్థము చేసుకోక పోవడము వలన అక్కడ చెప్పిన ధర్మము అధర్మముగానే నిలిచిపోయినది. ఇది ఒక మతమునకే పరిమితి కాదు. అన్ని మతములలోనూ దేవుడు చెప్పిన వాక్యములు ధర్మబద్ధముగా అర్థము కావడములేదు. అంతో ఇంతో జ్ఞానుల మనుకొను వారికే అర్థము కానప్పుడు మిగతా ప్రజల విషయములో వేరే చెప్పనవసరములేదు.

**30, ప్ర:- నేడు ప్రతి మతములోను బోధకులు వారి గ్రంథములలోని జ్ఞానమును**

**బోధిస్తున్నారు కదా! గ్రంథములోని జ్ఞానమును సరిగా తెలియకుండా బోధించడము వలన వారి బోధలను వినువారందరూ తప్పదారి పట్టిపోవు అవకాశము గలదు కదా! అటువంటప్పడు దైవజ్ఞానము తెలియాలను జిజ్ఞాస కలిగిన వానికి దేవుని జ్ఞానము ఎలా తెలియగలదు? అసలయిన ధర్మములు ఎలా తెలియగలవు?**

**జవాబు :–** ముందు మనిషి తాను జ్ఞానమును తెలియాలను జిజ్ఞాసతోయున్నా దానికి తగినంత శ్రద్ధ కలిగియండాలి. అట్లు శ్రద్ధయుండడము వలన దేవుని జ్ఞానమును బోధించు బోధకుడు కాకుండా గురువే వచ్చి జ్ఞానము తెలిపిపోవును.

**31, ప్ర :- జ్ఞాన జిజ్ఞాసయున్నవారు పూర్తి శ్రద్ధ కలిగియుంటే బోధకులను మించిన గురువు వచ్చి ధర్మములతో కూడుకొన్న జ్ఞానమును తెలిపినప్పడు మనిషి దేవుని జ్ఞానము తెలియగలడు. ఒకచోట దైవగ్రంథములో "దేవుని జ్ఞానమును దేవుడు తప్ప ఏ మనిషి తెలుపలేడని, దేవుని జ్ఞానము ఏ మనిషికీ తెలియదని" ఉన్నది కదా! దైవగ్రంథములోని జ్ఞానమును ధర్మబద్ధముగా దేవుడే చెప్పాలిగానీ, ఒక మనిషి అయిన గురువు ఎలా చెప్పగలడు? మనిషి అయిన గురువు చెప్పగలిగితే దేవుని జ్ఞానము దేవునికి తప్ప మనుషులకు తెలియదను దేవునిమాట అసత్యమగును కదా! దీనికేమంటారు?**

**జవాబు :–** "దేవుని జ్ఞానము దేవుడు తప్ప మరి ఏ ఇతర మనిషి చెప్పలేడు" అనుమాట శాసనము. ఆ మాటను ఎవరూ అతిక్రమించలేరు. అయితే ఇక్కడ గమనించవలసిన విషయమేమనగా! దేవుడు తన జ్ఞానమును మనుషులకు తెలియజేయు నిమిత్తము మనిషిగానే రావలసియున్నది. అందువలన దేవుడు మనిషిగా వచ్చినప్పుడు అతనిని 'దేవుడు' అనకుండా

'గురువు' అంటున్నాము. దేవుడు గురువుగా రావచ్చునుగానీ, మనిషి ఎప్పటికీ గురువు కాలేడు. మనిషిగా వచ్చిన దేవుడే గురువు అయినందున ఆయన తన జ్ఞానమును ప్రజలకు వివరముగా, ధర్మబద్ధముగా తెలియజేయ గలడు. మనిషి గురువు కానప్పుడు, దేవుడే గురువైనప్పుడు దేవుని జ్ఞానము దేవునికే తెలుసు అనుమాట సత్యమైనట్లే కదా! అయితే గురువుగా వచ్చిన దేవున్ని మనిషి రూపములో ఎవరూ గుర్తించలేరు. ఆయన గుర్తింపబడడు.

**32, ప్ర :- ఇప్పుడు మీరు చెప్పే జ్ఞానమంతా ప్రత్యేకముగాయున్నది. అయితే మీరు చెప్పే విధానము ప్రకారము ప్రతి మతములోను సంపూర్ణ ధర్మములు లేని జ్ఞానులేయున్నారని అర్థమగుచున్నది. అయినా ప్రతి మతములోనూ చిన్న పెద్దా జ్ఞానులు ఎందరో గలరు. కొద్దిగ తెలిసినవారుగానీ, ఎక్కువ తెలిసినవారుగానీ వారంతకు వారు మేము సంపూర్ణ జ్ఞానులమని ప్రకటించు కొనుచున్నారు. మాకు బాగా తెలుసునని ఒకరికొకరు వాదించుకొనుచున్నారు. అటువంటి స్థితిలోయున్నవారు ఇంకా కొంత కాలమునకయినా నిజమైన జ్ఞానమును తెలియగలరా? పూర్వమువలె దేవుని జ్ఞానము అందరిలో ప్రాకి అందరూ జ్ఞానులుకాగలరా?**

**జవాబు :-** గతచరిత్రను అనుసరించి ఇప్పుడు కూడా జ్ఞాన విషయములో అలాగే జరుగునని తలచుచున్నాము. మా అంచనా ప్రకారము హిందూ మతములోనివారు దాదాపు మూడువేల సంవత్సరములకు సంపూర్ణ జ్ఞానులుగా (పూర్తి ఇందువులుగా) మారగలరని అనుకొంటున్నాము. అట్లే క్రైస్తవ సమాజములోని వారు దాదాపు ఆరువేల సంవత్సరములకూ, ముస్లీమ్ సమాజము వారు ఆరువేల ఆరువందల సంవత్సరములకు పూర్తి ధర్మములు తెలిసినవారిగా మారిపోగలరు.

**33, ప్ర :- అన్ని మతముల వారు సంపూర్ణ జ్ఞానులయితే అప్పటి సమాజము ఎట్లుండగలదు? ఏ మతము అభివృద్ధి చెందియుండును? ఏ మతము క్షీణించియుండును?**

**జవాబు :-** భూమిమీద జ్ఞానములేని ఈ రోజులలో, ధర్మములు తెలియకుండా పోయిన ఇప్పటికాలములో దేవుని జ్ఞానము మూడు మతములుగా విభజింపబడియున్నది. ఇది ఇప్పటి పరిస్థితి. వెనుకటి కాలములోనికి పోయి చూస్తే జరిగిపోయిన మూడు యుగములలోగానీ తర్వాత కలియుగములో మూడువేల సంవత్సరములు గడచు వరకు క్రైస్తవ మతము పుట్టువరకు అనగా 38,91,000 సంవత్సరములవరకు మతముల ప్రసక్తే లేకుండా ఉండెడిది. అంతా ఒకే సమాజముగా మతమను పేరు లేకుండా జీవించెడివారు. పూర్వమునుండి కులాలు ఉండేవి. కులాల వలననే అప్పుడప్పుడు అక్కడక్కడ అజ్ఞానమునకు బీజము పడుతూ వచ్చి చివరకు కలియుగములో మతముల ప్రసక్తి వచ్చినది. నేడు భూమిమీద పన్నెండు మతములున్నా అందులో ఇందూ, ఇస్లామ్, క్రైస్తవ మతములే ముఖ్యమైనవి. ప్రస్తుతము ఉన్న స్థితినుండి ముందు హిందూ మతములో ధర్మములు తెలిసి అక్కడనుండి అవి అన్ని మతములకు ప్రాకి పోవును. చివరకు కాలము గడచుకొలది, సంవత్సరముల సంఖ్య పెరుగు కొలది మతములన్నీ జ్ఞానము వైపుపోవలసిందే! చివరకు భూమిమీద మనుషులందరూ జ్ఞానులుగా మారిపోవుట వలన దేవుని ధర్మములన్నీ అందరికీ తెలిసిపోయి మానవులందరూ జ్ఞానులుగా మారిపోవుదురు. మనిషిలో జ్ఞానము చేరిపోయిన రోజు మనిషికీ మనిషికీ మధ్య భేదము లేకుండాపోవును. అప్పుడు మతముల ప్రసక్తే యుండదు. అందరూ ఒకే సమాజముగా బ్రతుకగలరు. అందరూ ఒకే జ్ఞానము క్రింద చేరిపోవడము

వలన భూమండలమంతయు ఒకే దేవుని జ్ఞానము వ్యాపించి దేవుడు సర్వవ్యాపి అనియు, అవ్యయుడు అనియు తెలిసిపోగలదు. అప్పుడు గురువు యొక్క మహత్యము భూమిమీద ప్రకాశించగలదు. గురువు అంటే అందరికీ గౌరవము, భయము, భక్తి ఏర్పడును. **గురువే దేవుడనీ, దేవుడే గురువనీ తెలిసిపోగలదు.**

**34, ప్ర :- అలా అంత గొప్ప మార్పురావాలంటే ఉన్నట్లుండి ఒక్కమారు రాదు కదా! దానికి ముందు నుండే ఒక ప్రణాళికయుండును కదా! దేవుడు మూడువేల సంవత్సరములకు హిందువులు మొదట జ్ఞానులుగా మారుటకు ఇప్పటినుండి ఫతకమును ఏర్పరచాడా?**

**జవాబు :-** దేవుని ప్రణాళికలో భాగమే నేడు బయటికి వచ్చిన త్రైత సిద్ధాంతమని మేము అంటున్నాము. **"త్రైత సిద్ధాంతము"** అంటూనే వినే దానికి క్రైస్తవుల ప్రచారములాగ వుండును. అయితే ఇది ఒక మతమునకు సంబంధించినది కాదు. **మతములకు అతీతమైన జ్ఞానమును బోధించునదే "త్రైత సిద్ధాంత జ్ఞానము".** త్రైత సిద్ధాంత జ్ఞానము అన్ని మతముల వారికి అర్థమగుటయేకాక ప్రతి ప్రశ్నకు జవాబుగాయున్నది. త్రైత అనగా మూడు అని అర్థము. మూడు ఆత్మల విషయము మూడు మతములలో ఉండుట వలన మూడు మతముల వారికి "త్రైత సిద్ధాంత జ్ఞానము" తప్పనిసరిగా అవసరము. మూడు మతములలోని జ్ఞానమంతయూ త్రైత సిద్ధాంతముతో ముడిపడియున్నది. అందువలన మూడు వేల సంవత్సరములకు హిందువులను పూర్తి జ్ఞానులుగా మార్చుటకు నేడే "త్రైత సిద్ధాంత జ్ఞానము"ను తెర మీదికి తెచ్చాడు. ప్రపంచములో ఇంతవరకు లేని జ్ఞానము, ప్రపంచములో ఎవరికీ తెలియని జ్ఞానము. ప్రపంచములో మూడు మతములకు

సంబంధించిన జ్ఞానము, ఇప్పుడు బయటికి రావడములోని ఉద్దేశ్యము మూడువేల సంవత్సరములకు హిందూజాతిని సంపూర్ణ జ్ఞానులుగా మార్చుటకేనని అర్థమగుచున్నది.

**35, ప్ర :- మీరు ప్రతి దానికి శాస్త్రబద్దత అవసరము అని అంటూవుంటారు. అయితే ఇప్పుడు మీరు చెప్పు ఈ మాటకు శాస్త్రమును ఆధారముగా చూపగలరా?**

**జవాబు :-** మనుషులు ఏది చెప్పినా శాస్త్రాధారముండాలి. దేవుడు చెప్పే దానికి శాస్త్రాధారముండదు. **దేవుడు చెప్పేదే శాస్త్రము. దేవుడు చెప్పిన తర్వాత అది మనుషులకు శాస్త్రాధారముగా ఉండును.** భగవద్గీతను శ్రీకృష్ణుడు చెప్పినప్పుడు ఆయన చెప్పిన జ్ఞానము క్రొత్తదిగా ఉన్నది. ఆయన చెప్పిన మాటను అంతకుముందు ఏ శాస్త్రములో చెప్పియుండలేదు. అందువలన ఆయనమాటకు శాస్త్రాధారముండదనీ, ఆయన మాటే శాస్త్రమగుట వలన అదే భావితరములకు శాస్త్రాధారమని చెప్పవచ్చును. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున **"క్షర, అక్షర, పురుషోత్తమ"** అను ముగ్గురు పురుషులను గురించి భగవంతుడయిన కృష్ణుడు చెప్పినప్పుడు ఆ మాటను అంతకుముందు ఎవరూ చెప్పని దానివలన దానికి ముందు చెప్పిన ఆధారమును చూపలేము. తర్వాత ఎక్కడయినా ఆత్మల జ్ఞానము చెప్పినప్పుడు కృష్ణుడు చెప్పినమాట ఆధారమగుచున్నది. కృష్ణుడు భగవద్గీతను చెప్పిన మూడువేల సంవత్సరముల తర్వాత ఇస్రయేల్ దేశములో పుట్టిన ఏసు మూడు ఆత్మలను గురించి తన జ్ఞానములో చెప్పడము జరిగినది. తర్వాత ఆరువందల సంవత్సరములకు జిబ్రయేల్ అను ఆకాశ గ్రహము ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పినప్పుడు మూడు

ఆత్మల విషయమును చెప్పవలసి వచ్చినది, అలాగే చెప్పడమైనది. తర్వాత తయారయిన ఖురాన్ గ్రంథములో "ఖురాన్‌కు, బైబిలుకు (ఇంజీలుకు) తౌరాత్ గ్రంథమే ఆధారము" అని భగవద్గీతను గురించి చెప్పారు. తౌరాత్ గ్రంథమనగా భగవద్గీతయని తెలియవలెను. తౌరాతు గ్రంథములోని జ్ఞానమునే ఖురాన్ గ్రంథము ధృవీకరిస్తున్నదని **(5-43, 5-44, 5-46, 5-48, 5-68, 62-5) ఖురాన్ వాక్యములలో భగవద్గీతను గురించి సాక్ష్యము కలదు.** భగవద్గీతను ఆధారముగా చూపుచున్న వాక్యములు గలవు.

మొదట కృష్ణుడు జ్ఞానమును చెప్పినప్పుడు తన జ్ఞానము ఫలానా గ్రంథములో ఉన్నదని ఎక్కడా చెప్పలేదు. ఎందుకనగా! ఆయన చెప్పినదే అందరికీ శాస్త్రమయినది. అంతకుముందు ఎవరికీ తెలియని శాస్త్రమును ఆయన చెప్పుచున్నాడు కనుక దానికి ఆధారము లేదు. ఒక పరిశోధకుడు లేక శాస్త్రవేత్త ఒక సిద్ధాంతమును కనుగొని దానిని భూమిమీద అమలు పరచినప్పుడు అప్పుడది క్రొత్తగా కనిపించును. అప్పటినుండి అందరికీ ఆ సిద్ధాంతము ఆధారమగును. గతములో ఎప్పుడు ఎక్కడాలేని రేడియోను, టీ.వీ ని మొదట పరిశోధకుడు కనిపెట్టిన తర్వాత అదే సూత్రమును ఆధారము చేసుకొని మిగతావారు దానిని తయారు చేయడమైనది. అలాగే మొదట కనుగొనబడే శాస్త్రమునకు ఆధారముండదు. తర్వాత అదే అందరికీ ఆధారమగును. అదే విధముగా మొదట చెప్పబడే జ్ఞానమునకు ఆధారముండదు. తర్వాత అది అందరికీ ఆధారమగును. మొదట ద్వాపర యుగములో కృష్ణుడు చెప్పిన మూడు ఆత్మలకు శాస్త్రాధారములేదు. ఆ తర్వాత కలియుగములో వచ్చిన బైబిలుకు, ఖురాన్ గ్రంథమునకు అది సాక్ష్యాధారమైనది. బైబిలులో మత్తయి సువార్త 28వ అధ్యాయమున 19వ

వచనమున గల **"తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ"** అను మూడు ఆత్మలకు భగవద్గీతలోని **"క్షర, అక్షర, పురుషోత్తమ"** అను మాట ఆధారమైనది, బ్రహ్మవిద్యా శాస్త్రబద్ధమైనది. అలాగే అంతిమ దైవగ్రంథమని పేరుగాంచిన ఖురాన్ గ్రంథములో 50వ సూరా, 21వ ఆయత్‌నందు చెప్పిన **"తోలేవాడు, తోలబడేవాడు, సాక్షిగా చూచేవాడు"** అని చెప్పబడిన మూడు ఆత్మలకు భగవద్గీతయే ఆధారమని ఖురాన్ చెప్పుచున్నది.

**36, ప్ర :- నేడు మనుషులు ఎవరి మతములోని మాటను వారు నమ్ముదురు. మీ మాటను నమ్మరు కదా!**

**జవాబు :-** వారి మతములోని మాట అంటే వారి గ్రంథములోని మాటను వారు నమ్మడమే మంచిదని మేము కూడా చెప్పుచున్నాము కదా! వారి గ్రంథములోని మాటే మామాట అయినందున తేడా ఏమీ లేదు. ఎవరి గ్రంథములోని జ్ఞానమునకు వారు అలవాటుపడడములో తప్పులేదు. అయితే గుడిలో దేవునికి మనిషికి మధ్య పూజార్లు ఉన్నట్లు దైవగ్రంథములోని జ్ఞానమునకు మనిషికి మధ్యలో స్వామీజీలు, మత పెద్దలు, మత గురువులు అనువారు అడ్డుగాయుండి వారి మాటలనే ప్రజలకు చెప్పుచుందురు. వారి మాటలను వినేదానికి మనుషులు పుట్టలేదు. దైవగ్రంథములోని జ్ఞానమును తెలుసుకొని దానిని అనుసరించేదానికి ప్రజలు పుట్టారు. ఇప్పటికయినా మేల్కొని మత నియమములనుండి బయటపడి దైవగ్రంథము లోని మాటలను వినండి. మత పెద్దలనువారు మతములోని వారికి కళ్ళకు గుడ్డలు కట్టి నడిపించినట్లు మత నియమములను గుడ్డకట్టి గ్రుడ్డిగా నడిపిస్తున్నారు. వారికి దేవుడిచ్చిన గ్రంథములోని జ్ఞానమును తెలియకుండా చేయుచున్నారు. ఎవడయినా దైవగ్రంథములోని జ్ఞానమును తెలియాలని

ప్రయత్నిస్తే వానికి గ్రంథములోని వాక్యములకు తప్పు భావమును అంట గట్టి చెప్పుచున్నారు. వారు చెప్పినదే నిజమైన జ్ఞానమని అంటున్నారు. అలా మత నియమములలో చిక్కుకోకుండా మీకు దేవుడిచ్చిన గ్రంథములోని జ్ఞానమును తెలియండి.

**37, ప్ర:- మీరు చెప్పినట్లు మత నియమములను ప్రక్కనపెట్టి మాకు దేవుడిచ్చిన మా కొరకు దేవుడు అవతరింపజేసిన దైవగ్రంథమును మేము చూడడము జరిగింది. అందులో మేము తెరచి చూచిన అధ్యాయములో మీరు వ్యభిచారుల ఎడల ఇలా ప్రవర్తించండి, వ్యభిచారులను కొరడా దెబ్బలతో శిక్షించండి. భార్యలతో ఇలా కాపురము చేయండి, భార్యలను వదలిపెడితే వారికి పరిహారముగా ఇది ఇయ్యండి. మీరు భార్యలను వదలి ఇతరుల వద్దకు పోవద్దండి, మీ భార్య మిమ్ములను మోసము చేస్తే ఇలా చేయండి" అని మొత్తము ప్రపంచ విషయములే ఆ అధ్యాయమంతా గలవు. దానిని చూచిన మేము కొంత ఆశ్చర్యపోయి దైవగ్రంథములో అన్నీ ప్రపంచ విషయములున్నవే! అని అనుకొని తర్వాత వేరొక అధ్యాయమును తెరచి చూచాము. అక్కడా అటువంటి విషయమే కనిపించింది. ఇక్కడేమో ఆడవాళ్ళ వ్యభిచారము, అక్కడేమో మగవాళ్ళ వ్యభిచారమున్నది. "మీరు మగవారితో మీ కోర్కెలను తీర్చుకోవద్దండి, మీ భార్యతోనే కోర్కెలు తీర్చుకోండి" అని వ్రాయడము జరిగినది. ఇవన్నియూ ప్రపంచ విషయములు కర్మనుబట్టి జరుగునవని భగవద్గీతలో గలదు. అదే విషయమే మిగతా గ్రంథములలో కూడా గలదు. వాటిని గురించి చెప్ప దానిని నీతి అంటాము. నీతి ప్రపంచ సంబంధమైనదనీ మీరు చాలామార్లు చెప్పారు. దైవ గ్రంథములో దైవసంబంధమైన జ్ఞానముండాలి గానీ, ప్రపంచ సంబంధ నీతి ఎందుకుందో మీరే చెప్పాలి. ప్రపంచ సంబంధ**

**విషయములలో కూడా నీచమైన విషయములను ఎందుకు వ్రాశారో? ఈ విషయములను మహాజ్ఞానులయిన వారు చెప్పియుందురా! అని అనుమానము వచ్చుచున్నది. ఇవన్నీ చూచిన తర్వాత దైవగ్రంథములను వాటిలో ఉన్నదంతా జ్ఞానమేనా? దైవసంబంధ విషయములేనా? అని అడుగు చున్నాను. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** దైవగ్రంథములలో దైవజ్ఞానమే ఉండాలి, అయితే దైవజ్ఞానము కాని విషయములు మనిషికి అవసరములేని విషయములు కూడా కలవు. చిన్న ఉదాహరణను చూడండి. ఒకడు బజారుకు పోయి బియ్యము అంగడిలో ఒక బస్తా బియ్యమును కొని ఇంటికి తెచ్చుకొన్నాడు. మరుసటి రోజు వండుకొని తినవలెనని బియ్యము బస్తాను తెరువగా, అందులో మనకు అవసరములేనివి, మనము తినరానివి చాలా ఉన్నట్లు తెలిసింది. పైన మూటమీద పేరును చూస్తే (Ready For Cook) అని వ్రాసియుంది. 'వండుకొనే దానికి సిద్ధముగా ఉన్నాయి' అని మూట మీద వ్రాసినా, మూట తెరచి చూస్తే అవి తినే దానికి సిద్ధముగా లేవని తెలిసిపోయింది. అందులో రాళ్ళున్నాయి, అక్కడక్కడ మట్టిపెల్లలున్నాయి. ఇంకా వడ్లగింజలున్నాయి, బియ్యముతో పాటు బియ్యపు నూక కూడా ఉన్నది. బియ్యమును పట్టుకొని చూస్తే చేతికి కొంత తవుడు కూడా అంటుకొనియున్నది. మనము మన ఉద్దేశ్య పూర్వకముగా బియ్యమును కొన్నాము. అయితే బియ్యముతో పాటు బియ్యము మూటలో 1) రాళ్ళు, 2) మట్టిపెల్లలు, 3) వడ్లగింజలు, 4) నూక, 5) తవుడు ఇలా బియ్యముకాని ఐదు వస్తువులు అందులో కలిసి యున్నాయి. అప్పుడు అతడు తన ఆహారము కొరకు శుభ్రమైన అన్నము కొరకు బియ్యముకాని ఐదు వస్తువులను బియ్యమునుండి వేరుచేసి, బియ్యమును మాత్రము ప్రక్కకు తీసుకోవడము జరిగినది. కొనినప్పుడు

బియ్యపు మూట నూరు కేజీలుండగా, బియ్యపు మూటను శుభ్రపరచి అందులోని బియ్యముకాని ఐదు వస్తువులను తీసివేయగా తర్వాత నికర బియ్యము బరువు 90 కేజీలే వచ్చినది. దాదాపు పదికేజీల వృథా పదార్థములు అందులోనుండి బయటికి పోయాయి. ఈ విధముగా బజారు నుండి మూట బియ్యమును తెచ్చుకొని శుభ్రపరచుకొని తినవలసి వచ్చినది. బియ్యపు మూటను తెచ్చుకొన్నా అవి అట్లే తినుటకు ఉపయోగపడలేదు.

మనము ఉద్దేశ్యపూర్వకముగా బియ్యపు అన్నమును తినవలెనని బియ్యపు మూటను డబ్బుతో కొని తెచ్చుకొని చూచినా, అది అట్లే తినుటకు ఎట్లు ఉపయోగపడలేదో, అందులో బియ్యముకాని ఐదు వస్తువులు బియ్యముతో పాటు ఎలా చేరియున్నవో, అదే విధముగా మనము దైవ జ్ఞానమును తెలియాలను ఉద్దేశ్యముతో డబ్బుపెట్టి గ్రంథమును తెచ్చుకొని చూస్తే, అందులో మనకు ఉపయోగపడని ప్రపంచ సంబంధ ఐదు విషయములు ఉన్నట్లు తెలిసినది. బియ్యములో కలిసిన బియ్యముకాని ఐదు వస్తువులను ఎలా తీసివేసి బియ్యమును ఉపయోగించుకొన్నామో, అలాగే దైవగ్రంథములో కలిసిన ప్రపంచ సంబంధ ఐదు విషయములను తీసివేసి స్వచ్ఛమైన జ్ఞానమునే ఉపయోగించుకోవాలి. అంగడినుండి తెచ్చుకొన్న బియ్యపు మూటవలె నేడు దైవగ్రంథములు గలవని అర్థమగు చున్నది. మీరు దైవగ్రంథములో చూచినది కూడా అంతే. పొలములో పండినది స్వచ్ఛమైన బియ్యమే, అయితే అవి మనిషివద్దకు వచ్చేటప్పటికి ఎలా అందులో పండని ప్రక్క వస్తువులు చేరాయో, అలాగే మొదట దేవుడు చెప్పిన జ్ఞానము స్వచ్ఛమయినదే ఉండును. అది గ్రంథ రూపములో మనిషి వద్దకు వచ్చేటప్పటికి అందులో ఎన్నో అజ్ఞాన విషయములు కూడా చేరిపోవుచున్నవి. అందువలన నేడు ప్రతి దైవగ్రంథము లోనూ కొంతయినా

కలుషిత జ్ఞానముండును. కలుషిత జ్ఞానమును దేవుడు చెప్పలేదుగానీ, మనుషుల ప్రభావముచేత మధ్యలో మనుషుల జోక్యము చేత దైవగ్రంథములో దైవజ్ఞానము కానటువంటివి, ప్రపంచ సంబంధమైనటువంటివి అయిన ఐదు విషయములు దైవ గ్రంథములలో చేరిపోయినవి. అట్లు చేరిన విషయములను నీవు చూచి ఇవేమి బియ్యము! అన్నట్లు, ఇదేమి జ్ఞానము! అని అడుగుచున్నావు. కలుషిత బియ్యమునుండి స్వచ్ఛమయిన బియ్యమును బయటికి తీసుకొనుటకు, బియ్యములోని కలుషితమును బయటికి తీసివేయుటకు ఎలా చేట, జల్లెడను ఉపయోగించు చున్నామో, అలాగే గ్రంథములోని స్వచ్ఛమైన జ్ఞానమును గ్రహించుటకు, అందులోని ప్రపంచ విషయములను వేరు చేయుటకు మనలోని బుద్ధిని, శ్రద్ధను ఉపయోగించాలి. చేట, జల్లెడలను ఉపయోగించితే స్వచ్ఛమయిన బియ్యమును తినవచ్చును. అలాగే బుద్ధి, శ్రద్ధను ఉపయోగించితే స్వచ్ఛమయిన జ్ఞానమును పొందవచ్చును. కలుషిత జ్ఞానము అనునది ఒక మతమునకే పరిమితము కాదు. అది అన్ని మత గ్రంథములలో ఉన్నదని ఒప్పుకోక తప్పదు. బజారులో ఎంతమంచి పేరున్నా చివరికి కలుషిత బియ్యమే దొరికినట్లు, ఏది స్వచ్ఛమయిన మతమనినా, ఏది స్వచ్ఛమయిన గ్రంథమనినా, అందులో అంతో ఇంతో కలుషిత జ్ఞాన ముండును. దానిలో స్వచ్ఛత దొరకాలంటే తెలుసుకొనే మనిషిలోని బుద్ధినిబట్టి, శ్రద్ధనుబట్టి ఉండును.

**38, ప్ర :- మేము దేవుడు ఒక్కడే, భూమిమీద గల దేవుని జ్ఞానము ఒక్కటే అని మూడు మతములకు ఒక్కడే అధిపతియని, మూడు మతములలో చెప్పిన జ్ఞానము ఒక్కటే ఉండునని, మేము మూడు మతముల గ్రంథములను చదువుచున్నాము. అయితే మా మతములోని కొందరు బోధకులు, మత**

**పెద్దలు మమ్ములను మందలించి మనము క్రైస్తవులయివుండి, ఇతర మతముల గ్రంథములను చదవకూడదని చెప్పారు. అంతేకాక ఇతరులు వ్రాసిన క్రైస్తవ గ్రంథములను కూడా చదవకూడదని చెప్పారు. ఇతర మత గ్రంథములంటే మతద్వేషము వలన అలా చెప్పచున్నారని అనుకోవచ్చును. అట్లు కాకుండా ఇతరులు అనగా ఇతర మతముల వారు ఏసును గురించి గొప్పగా వ్రాసినా, బైబిలును గురించి గొప్పగా వ్రాసినా, అటువంటి గ్రంథములను కూడా చదవకూడదని ఎందుకు చెప్పచున్నారు?**

**జవాబు :-** ఇతరులు వ్రాసిన దేనినీ చదవకూడదని చెప్పుచున్నారంటే ఇందులో మతద్వేషము తప్ప ఏమీ లేదు. ఇతర మతముల వారు తమ మతములోనికి చేరిపోయి ఏసును గురించి వ్రాసినప్పుడు సరిపోయినది కదా! ఇతర మతములోవుండి ఏసు గొప్పతనమును గురించి వ్రాస్తే అది ఎందుకు ఆమోదయోగ్యము కాదు? అలా ఇతర మతస్థులు వ్రాసినది చదవకూడదను నియమమును పెట్టడములో వారి ఉద్దేశ్యము ఇతర మతములవారు కూడా మా మతములోనికి వస్తే మావారగుదురని చెప్పినట్లున్నది. మా వాడు కాకుండా మా దేవున్ని గురించి వ్రాసినా మేము ఒప్పుకోము అంటే వారిది కేవలము మత ఆటంకము తప్ప ఇతరము ఏమీ లేదని తెలిసినది. ఇది కేవలము మతపిచ్చియున్న వారు మాట్లాడు మాటలేకానీ తెలిసిన జ్ఞానులు మాట్లాడే మాటకాదు. ఏసు ఎక్కడయినా నా మతము వారు క్రైస్తవులని చెప్పాడా? నేను క్రైస్తవులకు మాత్రమే నా బోధను చెప్పుచున్నానని చెప్పాడా? ఏసు తన జ్ఞానమును బోధించునప్పుడు సమస్త జనులకని చెప్పాడు. అటువంటప్పుడు సమస్త జనులలో ఎవడయినా, ఏ మతము వానికయినా ఏసు జ్ఞానమును గురించిన అర్హత, అధికార ముండును. ఇతరులు వ్రాసిన దానిని చదువకూడదను వానినిగానీ ఇతర

మతగ్రంథములను చదువకూడదను వానినిగానీ, వాడు ఎంత పెద్ద జ్ఞాని అయినా అతనిని అజ్ఞానిగా లెక్కించండి. అటువంటి వారి మాటలను వినేవారిని కూడా ఏసు క్షమించడు. ఏసు దేవుడను ఏ క్రైస్తవుడూ అలా చెప్పకూడదు. అలా చెప్పాడంటే వాడు ఏసును, ఏసు జ్ఞానమును గౌరవించనట్లేయగును. ఇది ఒక్క క్రైస్తవ మతములోనే కాకుండా అన్ని మతములలోయున్న అజ్ఞానమే అని చెప్పవచ్చును. ఒక గురువు ఇంకొక గురువు వ్రాసిన ఏ గ్రంథమును చదవవద్దండని తమ శిష్యులకు చెప్పడము జరుగుచున్నది. మన గ్రంథములు ఇతర మతముల వారికి ఇవ్వండి, కానీ ఇతర మతముల వారు వ్రాసిన ఏ గ్రంథమును చదవద్దండని చెప్పు మతసంస్థలు గలవు. ఇటువంటి వారు ఎంత కాలముండినా వారికి దేవుని జ్ఞానము దొరకదు. వారు మతమౌఢ్యములోనే మునిగియుందురు.

**39, ప్ర:- ఒక దైవగ్రంథములోని ఒక వాక్యమును ఎంతో వివరముగా వివరించి చెప్పినా అర్థము చేసుకోలేని స్థితిలో కొందరున్నారు. అటువంటి వారు ఇతరులు ఏమి చెప్పచున్నారని కూడా చూడడము లేదు. తమకు ఒక వాక్యమును గురించి తెలిసిన దానినే సత్యమని చెప్పచున్నారు. ఏ విధముగా చూచినా అది సత్యమైవుండదు. ఏ వాదనకుగానీ, ఏ ప్రశ్నకు గానీ వారు చెప్పనది నిలబడదు. అయినా కొంతయినా విచక్షణ లేకుండా "తాము పట్టుకున్న కుందేలుకు మూడేకాళ్ళు" అన్నట్లు మొండిగా వాదించు చుందురు. అటువంటి వారు సత్యమును తెలుసుకోలేరా?**

**జవాబు :-** అటువంటి వారికి ముందే దేవుడు తీర్పు తీర్చియుంటాడు. అటువంటి వాడు దేవునికి ఇష్టములేనివాడైనందున వానిని ఎవడూ మార్చలేడు. వానికి దేవుడే తన జ్ఞానమును అర్థము కాకుండా చేసి దేవుని

నుండి దూరముగా పోవునట్లు చేయును. అటువంటి వానికి ఎంత గొప్ప జ్ఞానమును చెప్పినా వాడు వినే స్థితిలో ఉండడు. పైగా తనకు తెలిసినంత జ్ఞానము ఎవరికీ తెలియదను ఉద్దేశ్యములో ఉండును. దేవుని ఉగ్రత, దేవుని శాపము అతని మీద ఉండుట వలన వాడు దైవమార్గములోనికి పోయే వీలేలేదు. వాడు దూరముగా ఉండునట్లు దేవుడే చేశాడు. కావున వానికి క్షమాపణ లేదు, వాడు మారడు.

**40, ప్ర:- మతములో ముఖ్యమైన మనిషి, హోదాలో ముఖ్యమైన మనిషి, బోధన చేయడములో అగ్రస్థానములోయున్నవాడైనందున అతను ఏమి చెప్పితే అదే దైవవాక్కు అని ఆచరించు ప్రజానీకము గల మనిషియైనందున అతను ప్రజలకు మిగుల గౌరవనీయుడైయుండెను. అతనికి ప్రజలలో హోదా అయితే ఉన్నదిగానీ, దేవుని ఇష్టత అతనిమీద లేనందున దైవజ్ఞానము అతనికి సరియైన మార్గములో అర్థముకాలేదు. అతను బోధకులలో అగ్రస్థానములో ఉన్నందున అతడు దైవగ్రంథమునంతటినీ చదివియున్నాడు. అతనికి గ్రంథములో ఎక్కడ ఏ వాక్యమున్నదో తెలుసు. వాక్యములో కామా, ఫుల్‌స్టాప్‌లతో సహా వాక్యమును చెప్పగలుగు జ్ఞాపకశక్తి గలవాడై యున్నాడు. ఏ వాక్యమునయినా ధారాళముగా చెప్ప స్థోమత అతనికున్నది. ఏది ఎట్లున్నా దేవుని దయలేని దానివలన అతనికి దైవవాక్యము ఒకటి కూడా ధర్మబద్ధముగా అర్థము కాలేదు. దైవగ్రంథములోని అన్ని వాక్యములు అతనికి కంఠాపాటమే అయినా వాటిలోని ధర్మములు అతనికి తెలియ రాలేదు. "దేవునికి నచ్చితే సన్మార్గములోను, నచ్చకపోతే అపమార్గములోను పంపుతానని" చెప్పినట్లు ప్రపంచములో ఎంత పెద్దవాడయినా దేవుడు అతని హోదాను లెక్కచేయక తన ఇష్టమొచ్చినట్లు చేయును. అటువంటప్పుడు అతను చెప్ప వాక్యము దేవుని వాక్యమే అయినా అతను చెప్ప వివరము దేవుని ధర్మమునకు విరుద్ధముగా యుండుట వలన**

**అతని మాటను అనుసరించు వారందరూ అధర్మమార్గములోనే పోయినట్ల యినది. కొందరికి తమ నాయకుడు, తమ బోధకుడు చెప్పమాటలు అధర్మము లైనవని, దేవుని జ్ఞానమునకు విరుద్ధముగా ఉన్నాయని తెలిసినప్పుడు ఏమి చేయాలి? పైనగల మత నియమముల ప్రకారము తమ నాయకుడు, బోధకుడయిన అతని మాట ప్రకారము పోవాలా? లేక అతని మాటను కాదని అతను పెట్టిన మత నియమములను వదలి దేవుడు చెప్పిన జ్ఞానమును అనుసరించాలా? దేవుని జ్ఞానమును ధర్మయుక్తముగా అనుసరించాలంటే తమ మత పెద్ద అయిన అతనిమాటను వినకూడదు. అతని మాటను వినకపోతే, వినని వారు మత నియమములను అతిక్రమించినట్లగును. అప్పుడు పదిమంది దృష్టిలో తమ మతపెద్దను కాదని ప్రక్క దారిలో పోయినట్లగును. ఇటువంటి పరిస్థితులలో మేము ఎటు పోవాలి? దేవుని ధర్మము వైపు పోవాలా? మత నియమము వైపు పోవాలా? మీరు సరియైన సమాధానమును చెప్పమని కోరుచున్నాము.**

**జవాబు :-** దేశములో చాలామంది ఇటువంటి ప్రశ్నవద్ద చిక్కుకొని పది మందికి వ్యతిరేఖముగా కనిపిస్తామని మత నియమమును దాటుకొని బయటికి రాలేక లోపల లోపల కుమిలిపోయేవారు చాలామంది కలరు. అటువంటి వారు కొందరు బయటికి ఏమాత్రము కనిపించకుండా లోపల దేవుని మార్గములో ప్రయాణించవలెనని అనుకొనువారు కూడా కలరు. అయితే మత నియమములు దేవుని ధర్మములు తూర్పు పడమరలాగ ఉండుట వలన ఎటు తిరిగినా బయట పడవలసిందేనని అనుకొనువారు కొందరు గలరు. అటువంటి వారికి నేను చెప్పు సమాధానము ఒక్కటే! సర్వమునూ సృష్ఠించిన దేవుడే అందరికి పెద్దగానీ, నిన్న మొన్న పుట్టిన మతము పెద్ద కాదు. **దేవునికి తెలియకుండా ఏదీ జరుగదు. అన్నీ**

**ఆయనకు తెలిసే జరుగును.** ప్రపంచమునకంతటికీ దేవుడే పెద్ద. జ్ఞానములలో కెల్ల ఆయన జ్ఞానమే పెద్ద. అటువంటప్పుడు తెలివైనవాడు దేవుని జ్ఞానమునే అనుసరించునుగానీ మత నియమములను అనుసరించడు. మనుషులు కల్పించిన మత నియమములను వదలి దేవుడు ఇచ్చిన జ్ఞానము వైపు పోవువాడు దేవుని దృష్ఠిలో ఆయనకు ఇష్టుడగును. ప్రపంచములో మనుషులు కల్పించుకొన్న దానిని లెక్క చేయక దేవుని జ్ఞానమును, దేవుని వాక్యమును గౌరవించువాడు తొందరగా దేవుని వద్దకు చేరుకొనును. నేను హిందూమతములో పుట్టాను. అయితే దేవుడు చెప్పిన భగవద్గీత ప్రకారము నడుచుకొంటున్నాను. హిందూమతములోని నియమముల ప్రకారము మేము ఎప్పుడూ నడువలేదు. మనుషులు సృష్ఠించిన నియమములను ఆచరించు వాడు దేవునివైపు పోలేడు. దేవుని వైపు పోవాలనుకొనువాడు మనుషులు పెట్టిన నియమములను వదలి పెట్టవలసిందే.

మనిషిలో జ్ఞానానికి నిలయము తల. తల ముందర భాగమును పాలభాగము అంటారు లేక నొసలు అంటారు. మనిషి నాలో ఈ జ్ఞానమున్నదని తెలుపు నిమిత్తము నుదిటి భాగములో (పాలభాగములో) తలలోయున్న జ్ఞానమునకు సంబంధించిన గుర్తును ఉంచెడివారు. ఒక రాజ్యము ఎవరిది, అందులో ఏ రాజు ఉన్నాడను చిహ్నముగా రాజకోట మీద ఆ రాజ్యమునకు, రాజుకు సంబంధించిన జెండాను ఉంచెడివారు. అదే విధముగా ఒక శరీరము అను రాజ్యములో ఏ జ్ఞానమున్నది తెలియునట్లు వారివారి నుదిటి భాగము మీద ఆయా గుర్తులను పెట్టుకొనెడి వారు. పూర్వమునుండి అనగా కృతయుగమునుండి కలియుగమువరకు వేరే మతములే లేనందున ఒకే ఇందూ సమాజము ఉండెడిది. ఒకటిగా యున్న ఇందూ సమాజము కలియుగములో మూడుగా చీలిపోయి

అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము అను మూడు భాగములుగా విడిపోయింది. అలా చీలిపోయినందున అద్వైతమునకు ఒక గుర్తు, విశిష్టాద్వైతమునకు ఒక గుర్తు, ద్వైతమునకు ఒక గుర్తును ఏర్పరచుకొని ఎవరికి వారు ఆ గుర్తులను తమ ముఖము మీద అనగా నుదుటి భాగములో జెండావలె పెట్టుకొనెడి వారు. నేను హిందువునయినా హిందూ మతములోని ఏ చీలికరాజ్యములో లేను. అనగా ఏ ఆధ్యాత్మిక చీలికలో లేను. ఆ గుర్తులను ఏ దానిని నా ముఖము మీద పెట్టుకొనినా నేను ఫలానా హిందువుననీ, ఆ హిందువులో కూడా ఫలానా చీలికలోని వాడినని చెప్పి నట్లుండును. అందువలన నేను మత నియమములను వదలిన వాడినై మత సంబంధ గుర్తును నేను ధరించక దేవుడు చెప్పిన దైవగ్రంథముల ప్రకారము నడుచుకొనుచున్నాను. అట్లుండుట వలన నేను హిందువులకు దారి తప్పిన వానిగా కనిపించినా, దేవుని దృష్టిలో సక్రమ మార్గములో ఉన్నవాడిగాయున్నాను. నేను అన్ని మతములకు పెద్ద అయిన దేవున్ని గౌరవించువానిగా, ఆయన జ్ఞానమును అనుసరించువానిగా యుంటూ, నేను ఫలానాయనీ, నేను దేవుని మార్గములో యున్నానని తెలుపు నిమిత్తము దేవుని చిహ్నమయిన ఏడు ఆకాశముల గుర్తును నా నుదుటి భాగములో పెట్టుకొని చూపుచున్నాను. ఈ విధముగా మేముండుట వలన మమ్ములను స్ఫూర్తిగా తీసుకొని మావలె కొందరయినా వారివారి మత బంధనములనుండి బయటపడి దేవుని మార్గములోనికి రాగలరని అనుకొంటున్నాను. మేము చెప్పు దేవుని జ్ఞానమును చూచి, మతరహిత మార్గమును చూచి మా వైపు చాలామంది వచ్చి అసలయిన దేవుని మార్గములో ప్రయాణించుచున్నారు. అందువలన మీరు కూడా ధైర్యముగా 'మతము' అను వలలో నుండి బయటపడి 'దేవుడు' అను రాజ్యములో ప్రవేశించవలెనని తెలుపుచున్నాను.

మీరు మతపెద్ద అనియో, మతబోధకుడనియో గొప్పగా చూచుకొనువారు ఎంతటివాడయినా సరియైన జ్ఞానములేనప్పుడు అతని మాటను, అతని పెత్తనమును దాటి అతనిని కూడా సృష్ఠించిన దేవుని వైపు రావలసినదిగా తెలుపుచున్నాను.

**41, ప్ర :- ఇప్పడు ముఖ్యముగా మూడు మతములున్నవి కదా! హిందూ మతమువారు కొందరు మేము హిందువులము అని చెప్పచూ మా మతము క్షీణించిపోవుచున్నదనుచూ, మా మతములోని వారందరినీ (హిందువు లందరినీ) క్రైస్తవులుగా, ముస్లీమ్‌లుగా ఆ మతములవారు మార్చుచున్నా రనుచూ, ఈ విధముగా అయితే కొంత కాలమునకు హిందూమతము పూర్తిగా క్షీణించి పోగలదనుచూ, అట్లు కాకుండుటకు మా మతమును మేము రక్షించుకొనుటకు కావలసిన పద్ధతులను చేపట్టుచున్నామనుచూ "హిందూ ధర్మరక్షణ సంఘములనీ", "హిందూమత రక్షణ సమితులు" అని అనేక పేర్లతో హిందుమతసంస్థలు తయారయినాయి. అయితే ఆ సంస్థలలో పని చేయు వారికి హిందూధర్మములేవో కూడా తెలియవు. వారు హిందూ ధర్మములను ఒక్క దానిని కూడా ఇతరులకు చెప్ప స్థోమతలో లేరు. అటువంటివారు తమ హిందూమతమును కాపాడుకోలేక, వారున్న మతమును వీడిపోవు వానిని చూస్తూ, మతద్వేషముతో ఇతర మతముల మీద ద్వేషమును పెంచుకొని అసూయతో చూస్తున్నారు. అలాగయితే హిందూ మతమును కాపాడగలరా?**

**జవాబు :–** ఈ మాటను గత యాభై సంవత్సరములనుండి మేము వింటూనే ఉన్నాము. అప్పటినుండి ఎన్నో సంస్థలు హిందూ సమాజము రక్షణకొరకని తయారయినాయి. అటువంటివి చిన్నా పెద్ద సంఘములు దాదాపు 20కి పైగా ఉండవచ్చును. ఈ సంఘములన్ని వచ్చిన తర్వాతనే ఎక్కువ మత

మార్పిడిలు జరిగాయి. యాభైసంవత్సరముల ముందుకంటే తర్వాతనే హిందువులు మిగతా రెండు మతములలోనికి చేరిపోవడము జరిగినది. నేటికినీ హిందువుల సంఖ్య తగ్గిపోతుందను ఆందోళన హిందువులలో కలదు. జరుగుచున్న సత్యము కూడా అంతే! అయితే పదుల సంఖ్యలో యున్న హిందూ సంఘములన్నీ ఏమి చేయుచున్నట్లు? అని మేము ప్రశ్నించు చున్నాము. హిందూ సంఘములు తయారయిన తర్వాతనే ఎక్కువమంది హిందువులు క్రైస్తవులుగా, ముస్లీమ్‌లుగా మారిపోయారు. నేడు హిందూ రక్షణ సంఘములు ఎన్నియున్నా వాటిలో ఒక్క దానిలోనయినా ఆత్మ జ్ఞానమును గురించి తెలిసినవారున్నారా? కనీసము ఇవి హిందూ ధర్మములు అని ధర్మములను గురించి తెలిసినవారున్నారా? ఆత్మజ్ఞానము తెలియదు, హిందూ ధర్మములు తెలియవు. అటువంటి హిందూ సంఘములు నేడు గలవు. యుద్ధానికి పోయేవానికి మొదట తన రక్షణ కొరకు శరీర కవచముండాలి. తర్వాత శత్రువులను చంపుటకు ఆయుధములుండాలి. మేము యుద్ధ సైనికులమని పేరు పెట్టుకొన్న వారికి శరీరకవచముగానీ, ఆయుధములు గానీ లేనప్పుడు ఏమవుతుందో అదే నేడు హిందూమతములో జరుగుచున్నది. నేడు సైనికులమను వారివద్ద తన రక్షణకు కవచముగానీ, శత్రు సంహరణకు ఆయుధముగానీ లేనట్లు హిందూ రక్షణ సైన్యము వద్ద కవచమును పోలిన **ఆత్మజ్ఞానము**గానీ, ఆయుధమును పోలిన **ధర్మ పరిజ్ఞానము**గానీ లేదు. కావున నేడు హిందూ మత సంఘములు ఎన్ని యున్నా మతమార్పిడి జరుగుచునేయున్నది. హిందువుల సంఖ్య తగ్గి పోవుచునేయున్నది.

హిందువుల మత రక్షణ సంఘములు నేడు ఎన్ని ఉన్నా వారందరూ మేము ఎక్కడా మతమార్పిడులు జరుగకుండా చూస్తున్నామని అంటున్నా

హిందువులసంఖ్య ఎలా తగ్గుచున్నదను ప్రశ్నకు వారివద్ద సరియైన జవాబు లేదు. వారు పని చేయుచున్న మాట వాస్తవమే! అయితే కవచము, ఆయుధము లేని సైనికుడు యుద్ధము చేయుచున్నట్లు పని చేయుచున్నారు. మీ కార్యక్రమములేవి? మతమార్పిడులను ఎలా అరికట్టగలరు? అని ప్రశ్నించితే వారు చెప్పు సమాధానము కొంత ఆశ్చర్యమును కల్గించినది. వారు ఏమి చెప్పారనగా! ఎక్కడ క్రైస్తవ సభలు జరిగినా మేము వాటిని భంగపరుస్తున్నాము. మతమార్పిడీలను చేయు ఫాదర్, పాస్టర్‌లను దండించి, బెదిరించి ఇక ఎక్కడ కూడా మీరు అటువంటి కార్యములు చేయకూడదని హెచ్చరించి పంపాము. కొన్నిచోట్ల వారిని బాగా కొట్టాము. దానితో ఎక్కడ క్రైస్తవ బోధలు చెప్పమని చెప్పారు. మేమున్నాము కావున ఇంతకు ముందువలె ఇప్పుడు వీధులలో వారి మత ప్రచారము చేయడము లేదు. మా వలననే వారి సభలు తగ్గిపోయాయి అని చెప్పారు. ఈ విధముగా ప్రజలు ఇతర మతములలోనికి పోవుచుంటే, హిందూ సంఘములు మాత్రము స్వమత రక్షణలో పడిపోయారు. ఇతర మతముల వారు తమ మతముల లోనికి హిందువులను లాగుకొను ప్రయత్నము చేయుచుంటే హిందువులు మాత్రము ఇతరులను తమ మతములోనికి ఆకర్షించు కోవడము లేదుగానీ, ఉన్నవారిని పోకుండా చూచుకొంటూ స్వయం రక్షణలో పడిపోయారు. క్రైస్తవులుగానీ, ముస్లీమ్‌లుగానీ స్వయంరక్షణలో లేరు. వారు ఇతరులను ఆకర్షించుటలో లగ్నమైనారు. వారు చేసే పనిని మీరు చేయవచ్చును కదా! వారు ఆకర్షణలోవుంటే, మీరు ఎందుకు రక్షణలో యున్నారని అడిగితే "మేము మతమార్పిడీలు ప్రోత్సహించము" అని అంటున్నారు. ఇంకా కొందరు వారికి ఆ పని చేతనయితూవుంది కావున వారు అలా చేయుచున్నారు. మాకు ఆ పని చేయుటకు చేతకాలేదు, మేము చేయలేదు.

చేతనయితే మేము ఇతరులను హిందువులుగా మార్చలేక పోయినా ఇతర మతములలోనికి పోయిన హిందువులనయినా తిరిగి హిందూ మతము లోనికి మార్చవలెనని తలచుచున్నాము. అయితే వారు మార్చినట్లు ఒక్కరిని కూడా మార్చలేకపోవుచున్నాము అని అంటున్నారు.

ఇతర మతములవారు హిందువులను తమ మతములలోనికి ఎలా మార్చగలుగుచున్నారు? ఆ పనిని హిందువులు ఎందుకు చేయలేకున్నారని పరిశీలించి చూచితే, వారివద్దవున్నదేమి? వీరివద్ద లేనిదేమి అని యోచించి చూస్తే, ఈ విధముగా అర్థమగుచున్నది. "ఎదుటి వానిని మంచి మాటలతో మార్చవచ్చునుగానీ చెడు దూషణతో ఎప్పటికీ మార్చలేము" అనునది పెద్దలు చెప్పిన సూత్రము. జీవితము యొక్క అనుభవమున్న పెద్దలు "నోరు మంచిదయితే ఊరు మంచిదవును" అనుమాటను కూడా చెప్పెడివారు. వీటిని గ్రహించిన తర్వాత హిందువులవద్ద నోటినుండి వచ్చే మాటకంటే ఇతర మతములవారివద్ద నోటినుండి వచ్చే మాట హిందువులకు నచ్చిన దానివలన హిందూ ప్రజలు తమ హిందూ మతమును వీడి ఇతర మతములలో చేరిపోవుచున్నారని తెలియుచున్నది. అటువంటి మాటలు ఇతర మతములవద్ద ఏమున్నాయి? హిందువుల నోటినుండి వచ్చే మాటలకంటే క్రైస్తవుల మాటలుగానీ, ముస్లీమ్‌ల మాటలుగానీ సామాన్య హిందూ ప్రజలను ఎట్లు ఆకర్షించుచున్నాయి. హిందూ సమాజమునుండి హిందూ ప్రజలను హిందూ సమాజమాటలు ఎందుకు దూరము చేస్తున్నాయి? అని కొంత తెలుసుకోవాలనుకొన్న సమయములోనే, హిందువులుగాయున్న మేము కూడా, హిందూ సమాజములో మేము పెద్దలము అను చెప్పుకొనుచూ, హిందూ మతరక్షణ సంస్థలు ఏర్పరచుకొన్న వారి మాటల ప్రభావమునకు, చేతల దాడికి మేము "బుద్ధిలేక హిందువులుగా

బ్రతుకుచున్నాము, ఇటువంటి హిందూమతములో ఉండకూడదు” అను నిర్ణయానికి వచ్చాము. నన్ను అనుసరిస్తున్న కొన్ని వేలమంది హిందువులు మాతోపాటు అదే నిర్ణయానికి వచ్చారు. అదే సమయములో ముస్లీమ్ సంఘముల మాటలు మమ్ములను బాగా ఆకర్షించాయి. దానితో ఒక పేరున్న ముస్లీమ్ ఆధ్యాత్మిక సంస్థతో ‘ఇస్లామిక్ రీసర్చ్ సెంటర్’ వారితో సంప్రదించి మేము, నాతోపాటు కొన్ని వేలమంది మూకుమ్మడిగా ముస్లీమ్‌లుగా మారాలని నిర్ణయించుకొన్నాము. అలా మారితే అయినా హిందూ సంఘముల తీరు మారుతుందనుకొన్నాము. హిందూ సంఘముల వలననే హిందువులు ఇతర మతములలోనికి పోతున్నారని లోకమునకు తెలుస్తుందనుకొన్నాము. ఆ సమయములో హైదరాబాద్‌లో బషీర్‌బాగ్ సెంటర్‌లోగల ప్రెస్‌క్లబ్‌లో ప్రెస్‌మీట్ పెట్టి మేము ఈ కారణమున మతమును మారుచున్నామని మా అనుచరులు చెప్పడము కూడా జరిగింది.

ఈ విధముగా ఒక సందర్భములో ముస్లీమ్ మతమునకు దగ్గరగా పోయిన మేము చివరి సమయములో మా నిర్ణయమును మార్చుకొన్నాము. ఆ నిర్ణయమును మార్చుకోవడానికి ఒకే ఒక కారణముగలదు. అంతకు ముందు నేనే స్వయముగా **“మత మార్పిడి మహాపాపము”** అను గ్రంథమును వ్రాశాను. ఆ గ్రంథమును వ్రాసిన నేను, మతమార్పిడులను వ్యతిరేఖించు నేను, ఎవరి మాటలకో మతము మారితే ‘త్రాగుడుపోతు మాటలకు సీతను రాముడు విడిచిపెట్టినట్లుందని’ అలా చేయడములో మన ప్రజ్ఞ (తెలివి) పని చేయనట్లే కదా!యనీ, మనము హిందూమతములోనే యుండి నేడు ‘ఛీ’ అన్న వారితో ‘సై’ అనిపించుకోవాలనుకొన్నాను. అందువలన ఆ రోజు ముస్లీమ్‌గా మారలేకపోయాను. హిందూ సమాజములో నన్ను గురువుగా నమ్మినవారు, నా బోధలను అనుసరించువారు వేలమంది గలరు.

ఆ రోజు నేను మారియుంటే నాతోపాటు అందరూ మారేవారు. అటువంటి పరిస్థితి తెచ్చుకొన్న హిందూ సంఘములు ఎంత తెలివి తక్కువవో చూడండి. అలాంటి హిందూ సంఘములు హిందూ మతమును రక్షించుచున్నవో, భక్షించుచున్నవో మీరే యోచించండి!

మేము అద్వైత సిద్ధాంతమువలె **"త్రైత సిద్ధాంతము"**ను ప్రచారము చేస్తే జ్ఞానము తెలియని హిందువులు మమ్ములను క్రైస్తవ ప్రచారకులుగా వర్ణించారు. మేము హిందువులలో ముఖ్యమైన వ్యక్తిగాయున్నామని తెలిసినా ఏమాత్రము జ్ఞానము తెలియని వారు మమ్ములను, మా గ్రంథములను అవమానపరచడమేగాక మేము వ్రాసిన 'త్రైత సిద్ధాంత భగవద్గీత'ను అగ్గిపెట్టి కాల్చడము జరిగింది. హిందువు ముసుగులో క్రైస్తవ మతమును ప్రచారము చేయుచున్నామని మమ్ములను ఆరోపించడము జరిగింది. ఇదంతా గుంతకల్లు పట్టణములో జరిగిన సమాచారము గతములో కొందరికి తెలిసే వుంటుంది. అటువంటి మూర్ఖులు ప్రేరేపిస్తే వారి ప్రేరణకు హిందూ మతమును వదలాలనుకొన్నా తర్వాత చివరి క్షణములో మా నిర్ణయమును మార్చు కొన్నాము. దీనినిబట్టి చాలామంది హిందువులకు, హిందూ సంఘములు ఏమి పనిచేయుచున్నవో అర్థమయిపోయినది. ఏమాత్రము దైవజ్ఞానమును తెలియని వారిని హిందూ సంఘములలో సభ్యులుగా నియమించితే ఇటువంటి అనర్థములే జరుగుతాయి.

నేడు మా బోధలను చూచి అన్ని మతములవారు మావైపు ఆకర్షితులవుతున్నారు. అయినా మేము ఎవరినీ మతము మార్చుకోమని చెప్పలేదు. మేము ఈ మధ్యకాలములో ఒక ప్రకటన చేశాము. అది ఏమనగా! **"మతాలు నిషిద్ధము, నిషేధము. కులాలు అహేతుకము, అశాస్త్రీయము. కులమతములకు అతీత భావములున్నవారు మా "ప్రబోధ**

**సేవాసమితి"లో చేరండి"** అని చెప్పాము. ఈ విధముగా ప్రజలకు జ్ఞానమును చెప్పితే ప్రజల భావములు మారిపోతాయిగానీ హింసతో, దౌర్జన్యముతో ఎవరినీ మార్చలేము. నేడు మా జ్ఞానము వినిన ముస్లీమ్‌లు, క్రైస్తవులు, హిందువులు ముగ్గురు మావద్దకు రావడము జరిగినది. మమ్ములను నిందించిన మీవైపు ఇతర మతముల వారు ఒక్కరయినా వచ్చారా? కనీసము హిందువులయినా వచ్చారా? దేవుని జ్ఞానమును చెప్పితే ఎవరయినా వస్తారు గానీ, రాజకీయపార్టీలాగా మాట్లాడితే ఎవరూ రాకపోగా మిమ్ములను ఏవగించుకుంటారు. నేడు హిందూ సమాజములో రక్షణ సంఘములను పేరుతో ఎంతోమందియున్నా, హిందువుల సంఖ్య ఎందుకు తగ్గిపోతుందో చెప్పగలరా? మా జ్ఞానమును వినిన ఎవడయినా, ఎక్కడయినా మతము మారాడేమో చూపగలరా? మా దగ్గరయున్న జ్ఞానము హిందూ సంఘముల వద్దలేదు కావున హిందువులను మతమార్పిడులనుండి నిలుపలేక పోవుచున్నారు. మీవద్ద లేని జ్ఞానము మావద్దయున్నది. కావున మా బోధలు విన్న ఎవడుగానీ మతమును మారలేదు.

ఇందూత్వము పేరుతో సంఘములను పెట్టుకొన్నంత మాత్రమున హిందువులను పరమతముల వైపు పోకుండా నిరోధించలేము. ఇందూ సంఘములలో ఇందూ జ్ఞానముండాలి. ఇందూ జ్ఞానము ద్వారా ఇందూ ధర్మములను బోధించగలిగితే హిందువులు హిందువులుగానే ఉండగలరు. ఇందూ మతము పూర్వము ఎంత గొప్పగా ఉండేదో తెలియగలదు. గత చరిత్ర మరచిపోయి రెండు మూడు వందల సంవత్సరములప్పుడు **"ఇందూ"** పదము "హిందూ" పదముగా మారినదని తెలియనివారు నేడు మేము 'ఇందూ' అను పదమును చెప్పితే అది కూడా పరాయిమతము అంటున్నారు. తన, పర వ్యత్యాసము తెలియనివారుగా నేడు హిందువులు గలరు.

**42, ప్ర :- నేడు భూమిమీద తెలిసినవాడు, తెలియనివాడు నాది నిజమైన జ్ఞానము అని నమ్మపలుకుచున్నారు. ఇక మత విషయములోనికి వస్తే హిందువులకంటే మాది ఉన్నతమైన జ్ఞానమని ముస్లీమ్‌లు, ముస్లీమ్‌లకంటే మాదే నిజమైన జ్ఞానమని క్రైస్తవులు వాదించుచుండగా మాది సనాతన ధర్మమని, మిగతావన్ని తర్వాత వచ్చినవని హిందువులు చెప్పచున్నారు. ఈ విధముగా మాది పెద్ద, మాది పెద్ద అని అన్నిమతములవారు అనుచుండగా, వారిలోనే కొందరు క్రైస్తవులు నేను నిజమైన జ్ఞానిని అని అనగా, ముస్లీమ్‌లు మా గ్రంథములోని జ్ఞానమే నిజమైన జ్ఞానము దానిని తెలుసుకొన్న మేమే నిజమైన జ్ఞానులమని అంటున్నారు. ఇక హిందువుల విషయానికివస్తే హిందూ సంఘములలో జ్ఞానమంటే ఏమిటో తెలియని వారున్నా, కొందరు స్వామీజీలు ఈ సంఘములతో సంబంధము లేకుండా ఆశ్రమాలను స్థాపించుకొని ప్రత్యేకమయిన పీఠములను పెట్టుకొని వారికి తెలిసినది వారు చెప్పచూ నేనే పెద్ద జ్ఞానముగలవాడినని బయటికి చెప్పకున్నా లోపల నన్నుమించిన వాడులేడు అని అనుకొనుచున్నారు. ఇంతమంది ఇన్ని మతములలో ఇన్ని రకముల జ్ఞానములు కలవారుండగా ఏమీ తెలియని వాడు వీరిలో ఎవరిది నిజమైన జ్ఞానమని తెలియాలి? ఎవరివద్దకు పోతే అసలయిన దైవజ్ఞానము దొరుకుతుందని అనుకోవాలి? ఎవరిది నిజమైన జ్ఞానమో ఎలా తెలియాలి?**

**జవాబు :-** మనిషి ఇంద్రియముల ద్వారా తెలుసుకొనే విషయములలో కనిపించేవి, వినిపించేవి అని రెండు రకములు గలవు. కనిపించే వాటిని ఏది ఎంత అని కొలిచే దానికి కొలతలు గలవు. ద్రవపదార్థమును కొలిచేవి, ఘనపదార్థమును కొలిచేవి, శక్తిని కొలిచేవి, గ్యాస్ వాయువును కొలిచేవి అనేక రకముల కొలతలు గలవు. వినిపించే వాటిలో ఏది గొప్పది, ఏది గొప్పది కాదు అను దానికి తెలియజేయు కొలత కూడా కలదు. అట్లు

శబ్ద విషయములో పరిజ్ఞానమును తెలుపు దానిని శాస్త్రము అంటారు. ప్రపంచములో ప్రతి విషయము శాస్త్రము అనే దానితో అనుసంధానము చేయబడివుండును. ఆ విధముగా ప్రపంచములోని ప్రపంచ సంబంధ అన్ని విషయములకు ఐదు శాస్త్రములతో అనుసంధానము చేయబడినది. ఆ ఐదు విషయములకు సంబంధించిన ఐదు శాస్త్రములను వరుసగా **ఒకటి గణిత శాస్త్రము, రెండు ఖగోళ శాస్త్రము, మూడు రసాయన శాస్త్రము, నాలుగు భౌతిక శాస్త్రము, ఐదు జ్యోతిష్య శాస్త్రము అనునవి కలవు.** ఈ ఐదు ప్రపంచమునకు సంబంధించిన శాస్త్రములని నిర్ణయించబడినవి. ఇప్పుడు మనకు కావలసినది ప్రపంచ విషయము కాదు, పరమాత్మ విషయము. ప్రపంచ విషయములు ఐదుకాగా వాటికి ఐదు శాస్త్రములున్నవి. పరమాత్మ విషయము ఒకటే అయినందున దానికి ఒకే శాస్త్రము కలదు.

ప్రపంచ విషయములోగానీ, పరమాత్మ విషయములోగానీ ఏది గొప్ప, ఏది దిబ్బ, ఏది మంచి, ఏది చెడు అని తేల్చి చెప్పుటకు శాస్త్రము ఆధారమవుతుంది. కోర్టులో చట్టముననుసరించి ఏది నేరము, ఏది నేరము కాదు అని తేల్చి చెప్పినట్లు శాస్త్రమునుబట్టి ఏ విషయమునయినా తేల్చి చెప్పవచ్చును. శాస్త్ర ఆధారము లేకపోతే నాది గొప్ప నాది గొప్ప అను వాదము తెగదు. 'ఎవరు గొప్ప' అను విషయమును మొండిగా వాదింతురు. శాస్త్రము ద్వారా అయితే అది ఏదయినా ఒక్క క్షణములో తేల్చివేయవచ్చును. దేశములో ఎటువంటి తగాదాలు రాకుండావుండుటకు, ఒకవేళ వచ్చినా వాటిని తేల్చి చెప్పుటకు ముందే శాస్త్రమును నిర్ణయము చేసి తయారుచేసిపెట్టాడు.

ఒక విషయమును గురించి ఇలాగున్నదని చెప్పడము ఆ విషయము నకు సంబంధించిన విషయ జ్ఞానము అని అంటాము. ఒక జ్ఞానమును

విడదీసి చూడగలిగినా లేక దానిని ప్రత్యక్షముగా అనుభవించి చూచినా దానిని 'విజ్ఞానము' అని అంటాము. జ్ఞానము ప్రపంచముదిగానీ, పరమాత్మది గానీ దానిని అనుభవించినప్పుడుగానీ, ప్రత్యక్షముగా చూచినప్పుడు గానీ, దానిలో సత్యము బయటపడును దానినే విజ్ఞానము అని అనగలము. ఇంకా వివరముగా చెప్పితే ఒక విషయమునకు సంబంధించిన సత్యమును విజ్ఞానమనియు లేక శాస్త్రీయమనియు చెప్పవచ్చును. విజ్ఞానమనగా సైన్సు అని కొందరంటూవుండగా విన్నాము. ఆ మాట వాస్తవమే! సైన్సు అని ఇంగ్లీషు భాషలో చెప్పినా, విజ్ఞానమని తెలుగు భాషలో చెప్పినా దానినే ఇంకొక రూపములో 'శాస్త్రము' అని అంటున్నాము. శాస్త్రములో రెండు రకములుగా కొందరు వర్ణించడము కూడా జరిగినది. ప్రపంచ విషయములకు సంబంధించిన శాస్త్రములకు **"సాధారణ శాస్త్రమనియు"** లేక **"సామాన్య శాస్త్రమనియు"** చెప్పడము జరుగుచున్నది. ప్రపంచ విషయములకు సంబంధించిన ఐదు శాస్త్రములను ఐదు సామాన్య శాస్త్రములుగా చెప్పవచ్చును. అయితే దేవుని విషయమునకు సంబంధించిన శాస్త్రమును **"అసమాన్య శాస్త్రము"** అని చెప్పవచ్చును. సామాన్య అను పదమును విశేషముగా చెప్పడమును 'అసమాన్య' అని అంటున్నారు. అలా అనడము వలన అది ఐదు శాస్త్రములవలెనుండునది కాదని విశేషమైన శాస్త్రమని తెలియుచున్నది. సామాన్య శాస్త్రమును విజ్ఞాన శాస్త్రము అని తెలుగులో చెప్పినా, ఇంగ్లీషు భాషలో సైన్సు అనినా, అసమాన్య శాస్త్రమయిన బ్రహ్మవిద్యా శాస్త్రమును లేక దేవుని జ్ఞానమును **"సూపర్ సైన్సు"** అని క్రొత్త పేరుతో పిలుస్తున్నారు.

ఇంగ్లీషు భాషలో సైన్సు, సూపర్‌సైన్సు అని రెండు రకములు చెప్పినా తెలుగులో సామాన్య, అసమాన్య అని ప్రపంచ జ్ఞానమును,

పరమాత్మ జ్ఞానమును విడదీసి చెప్పినా కొన్నిచోట్ల జ్ఞానము అనుపదమును విజ్ఞానముగా చేసి చెప్పారు. భగవద్గీత మనకు అనగా ప్రజలందరికీ, సర్వమానవాళికి ప్రథమ దైవగ్రంథము. భగవద్గీతా జ్ఞానమును భగవంతుడ యిన కృష్ణుడు 5000 సంవత్సరముల పూర్వము చెప్పడము జరిగినది. అప్పుడు గ్రంథ రూపముగా వ్రాసిన వ్రాతలో **"జ్ఞానము", "విజ్ఞానము"** అను పదములు అక్కడే కనిపించాయి. ఇప్పుడు భగవద్గీతలోని సప్త మాధ్యాయమైన విజ్ఞానయోగములో రెండవ శ్లోకమున మరియు నవమాధ్యాయమైన రాజవిద్యా రాజగుహ్యా యోగమను దానియందు మొదటి, రెండవ శ్లోకములలో ఈ విధముగా చెప్పారు చూడండి.

**విజ్ఞానయోగము 2వ శ్లోకము...**

శ్లో॥ జ్ఞానం తేஉహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్య శేషతః ।
యజ్జ్ఞాత్వా నేహభూయోన్యత్ జ్ఞాతవ్య మవ శిష్యతే ॥

**భావము :-** "**జ్ఞానమును నీకు నేను విజ్ఞాన సహితముగా** తెలియజెప్పెదను. దేనిని తెలిసిన తర్వాత దేనిని తెలియవలసిన అవసరముండదో అట్టి దానిని గురించి చెప్పెదను వినుము"

**రాజవిద్యా రాజగుహ్యా యోగము 1వ శ్లోకము...**

శ్లో ॥ ఇదం తుతే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యన సూయవే ॥
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసే శుభాత్ ॥

**భావము :-** ఇది అతి రహస్యమైన **జ్ఞానమును విజ్ఞాన సహితముగా** వివరించి చెప్పెదను వినుము. దీనివలన నీలోని అజ్ఞానమంతయు పోయి జ్ఞానము కలుగును. నీవు అసూయలేకుండా వినుము.

**రాజవిద్యా రాజగుహ్యా యోగము 2వ శ్లోకము...**

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥

**భావము :-** భూమిమీద గల విద్యలన్నిటిలో గొప్ప విద్య అయిన, రహస్యము లలో గొప్ప రహస్యమైన, ఉత్తమమైన మరియు పవిత్రమైనది. **ప్రపంచములో ప్రత్యక్ష అనుభవమునకు వచ్చునది**, అవ్యయమైనది. అనుష్టానమునకు తగినదియైన ధర్మమును గురించి తెలియచెప్పుదును వినుము.

పైన చెప్పిన ఈ రెండు శ్లోకములలో జ్ఞానమును విజ్ఞాన సహితముగా అని చెప్పడమైనది. విజ్ఞానము అనగా సత్యము అనీ, ప్రత్యక్ష అనుభవమునకు వచ్చునదని చెప్పుకొన్నాము. అదే విషయమునే రెండు శ్లోకములందు విజ్ఞాన సహితముగా అని చెప్పి మూడవ శ్లోకమున ప్రపంచములో ప్రత్యక్ష అనుభవమునకు వచ్చునది అని కూడా చెప్పారు. ప్రత్యక్ష అనుభవము అనగా సత్యమనియేగా అర్థము. ఈ విధముగా భగవద్గీతలో కూడా భగవంతుని ద్వారా దేవుడు శాస్త్రము అంటే విజ్ఞానమనీ, విజ్ఞానమంటే సత్యమని తెలియచెప్పడమైనది. ఇప్పుడు ఈ విధానమును ఆధారము చేసుకొని ఎవరు చెప్పుమాట సత్యమో, ఎవరు చెప్పుమాట అసత్యమో తేల్చి చెప్పవచ్చును. అనగా శాస్త్రాధారముతో ఏది సత్యమో, ఏది అసత్యమో నిర్ణయించి చెప్పవచ్చును.

పూర్వము ఒక వృద్ధుడు తన జీవిత అనుభవముతో ఒకమాట చెప్పెడి వాడట. “అనుభవమునకు వచ్చునదంతా సత్యము. అనుభవము నకు రానిదంతా అసత్యము” అని అంటూ వుండేవాడు. సత్యము శాస్త్రము. శాస్త్రము కానిది అసత్యమని ఆ వృద్ధుని మాటనుబట్టి చెప్పవచ్చును.

జ్ఞానమును ఒకడు చెప్పుచూ నా జ్ఞానము అన్నిటికంటే గొప్పదని చెప్పే వాడట. అతను చెప్పు జ్ఞానము ప్రకారము నడచి చూచినప్పుడు అది తప్పో ఒప్పో అని తెలిసిపోవును కదా! ప్రపంచములో తప్పు ఒప్పులను గురించి సత్యాసత్యములను గురించి, శాస్త్ర అశాస్త్రములను గురించి ఒకమాటను నానుడిగా ఇప్పటికాలములో కూడా అక్కడక్కడ చెప్పడము విన్నాము. అయితే ఆ మాటను వారు ఊత పదముగా చెప్పుచున్నారేతప్ప అర్థసహితముగా చెప్పలేదని తెలిసినది. పూర్వము ఈ మాటను అర్థముతో కూడుకొన్న భావముతో చెప్పెడివారు. **"కుమ్మరోల్ల పెళ్ళికూతురు దిబ్బ మీదికి వచ్చినప్పుడు తెలుస్తుందిలే!"** అనేవాళ్ళు. అలా ఎందుకు అనే వారంటే, ఒక ఊరిలో కుమ్మరి వారి ఇంటిలో పెళ్ళి జరిగినదట. అప్పుడు ఆ పెళ్ళి కూతురుకు సంబంధించిన వ్యక్తి పెళ్ళికూతురుకు చాలా పొడవాటి వెంట్రుకలున్నాయి, అందమైన పొడవాటి జడగలది అని చెప్పేవాడట. పెళ్ళయిన ఆ రోజు రాత్రికి ఊరేగింపు జరుగుతుంది కాబట్టి, ఆ ఊరేగింపు జరుగు దారిలో ఎత్తుగా మట్టికుప్ప ఉండేది, పెళ్ళికూతురు పెళ్ళికొడుకు ఊరేగింపులో ఆ మట్టి దిబ్బ ఎక్కి రావలసియుంటుంది. అప్పుడు పెళ్ళి కూతురును బాగా చూడవచ్చును. ఆమెకున్న పొడవాటి జడను చూడవచ్చు ననీ ఆ ఊరిలోని వారనుకున్నారట. అలా అనుకోవడములో "కుమ్మరోల్ల పెళ్ళి కూతురు దిబ్బమీదికి వచ్చినప్పుడు తెలుస్తుందిలే" అని అనుకొన్నారట. ఆ మాట శాశ్వతముగా నిలిచిపోయినది. పెళ్ళికూతురు బంధువు ఒకడు పెళ్ళికూతురుకు పొడవాటి జడవుంది అని చెప్పుమాట నిజము కావచ్చు, అబద్ధము కావచ్చును. ప్రత్యక్షముగా చూచినప్పుడు ఆ మాటలోని సత్యము తెలిసిపోవును కదా! సాయంకాలము ఊరేగింపు జరుగునప్పుడు అందరూ చూడవలెనని వచ్చారు. కొంతసేపటికి ఊరేగింపు మట్టిదిబ్బ దగ్గరకు

వచ్చింది. పెళ్ళికూతురు ఎత్తుగాయున్న దిబ్బ ఎక్కడము వలన అందరికీ బాగా కనిపిస్తుందని మట్టిదిబ్బ దగ్గర చాలామంది కాచుకొని చూస్తుండిరి. అప్పుడు పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు ఇద్దరు దిబ్బ ఎక్కినారు. దిబ్బ ఎక్కి ఒక నిమిషము అందరూ చూచునట్లు నిలుచుకొని వెంటనే దిగే దానికి మొదలుపెట్టారు. అప్పుడు పెళ్ళికూతురు కాలుజారి క్రింద పడడము తలమీద పెట్టిన కృత్రిమవెంట్రుకలు ఊడిపోయి జడతో సహా క్రిందపడి పోవడము జరిగినది. అప్పుడు పెళ్ళికూతురు వెంట్రుకలను గురించి చెప్పినమాట అసత్యమని ప్రత్యక్ష ప్రమాణముగా తెలిసిపోయినది.

ఏదయినా ప్రత్యక్షముగా జరుగు సత్యమే శాస్త్రమనియూ, విజ్ఞాన మనియూ చెప్పెడివారు. ఏది ప్రత్యక్ష అనుభవమునకు వచ్చునో అదే సత్యమనీ, సత్యమేదో అదే వాస్తవమనీ, దేవుడు చెప్పిన జ్ఞానము సత్యమే అగుట వలన బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించినదని చెప్పుచున్నాము. ఇదంతా తెలిసిన దేవుడు తన జ్ఞానమును చెప్పునప్పుడు మనుషులు గ్రహించునట్లు నేను సత్యసమేతముగా నా జ్ఞానమును చెప్పుచున్నానని చాలామార్లు చెప్పాడు. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 5, ఆయత్ 48యందు ఇలా చెప్పాడు చూడండి. **(5-48) " ఓ ప్రవక్తా! మేము ఈ గ్రంథాన్ని నీపై సత్యముతో అవతరింపజేశాము. ఇది పూర్వ గ్రంథాలలో మిగిలియున్న సత్యాన్ని ధృవపరుస్తుంది. మరియు వాటిలో యున్న సత్యాసత్యాలను పరిష్కరిస్తుంది. కావున నీవు అల్లాహ్ అవతరింప జేసిన ఈ శాసనము ప్రకారము వారిమధ్య తీర్పు చెయ్యి మరియు నీవద్దకు వచ్చిన సత్యాన్ని విడచి వారి కోరికలను అనుసరించకు"**

ఇక్కడ దేవుడు తన జ్ఞానాన్ని తెలుపుచూ తనది శాస్త్రబద్ధమైన జ్ఞానమని చెప్పుటకు సత్యసమేతమయిన జ్ఞానమని వర్ణించి చెప్పాడు. సత్యముతో కూడుకొన్న జ్ఞానము అని చెప్పడములో ఇదే నిజమైన జ్ఞానమని చెప్పినట్లయినది. నీవు అడిగిన ప్రశ్నలో ఎందరో తమ జ్ఞానమును గొప్పదని చెప్పుచున్నారని, ఏది నమ్మాలని అడిగావు. దేవుడు చెప్పినట్లు ఏదయితే సత్యమయిన జ్ఞానమో అదే నిజమైన గొప్ప జ్ఞానమని నమ్మవలెను. సత్యా సత్యములు తెలియుటకు ప్రత్యక్ష అనుభవములు సరిపోవునని వాటిని చూచి ఏది నిజమైన జ్ఞానమో గుర్తించవచ్చును. కుమ్మరోల్ల పెళ్ళికూతురుకు జడపొడవు అన్నమాట సత్యమా! కాదా!యని తెలియుటకు పెళ్ళికూతురు దిబ్బమీదికి వచ్చినప్పుడు ప్రత్యక్ష అనుభవము ద్వారా తెలిసిపోయింది కదా! అదే విధముగా! ఏ మతము వాడయినా, ఏ కులము వాడైనా 'నా జ్ఞానము గొప్ప' అని చెప్పినంతమాత్రమున ఆ మాటను వినిన వారందరూ అతని మాట సత్యమని నమ్మవలసిన పనిలేదు. కుమ్మరోల్ల పెళ్ళికూతురును చూచినట్లు చూడగా, వారు చెప్పుమాటలోని విధానమేదో అనుభవము ద్వారా బయటపడును. అప్పుడు ఎవడు జ్ఞాని, ఎవడు అజ్ఞాని అని సులభముగా తెలియవచ్చును.

ఈ విధానమును మనుషులు తెలియాలని, ఇతరులు చెప్పు మాటలను విని వారు జ్ఞానులని మోసపోకుండుటకు ఎవరు జ్ఞానులో, ఎవరు అజ్ఞానులో తెలియునట్లు తన వాక్యములో "సత్యసమేతము" అను పదమును వాడి అందరికీ కనువిప్పు కలుగజేశాడు. ఈ విధానము అర్థమగుటకు భూమిమీద ఎంత పెద్ద హోదాలో యున్నవాడయినా, ఎంత పెద్ద పేరుగాంచియున్నా అతనిని సులభముగా గుర్తించి అతనిలోని జ్ఞానమెంతయని చూడగలుగు విధానము అర్థమగుటకు అంతిమ దైవ

గ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 29, ఆయత్ 44లో వ్రాసియున్న దానిని ఇప్పుడు చూస్తాము. **(29-44) " అల్లాహ్ ఆకాశాలను భూమిని సత్యబద్దముగా సృష్టించాడు. ఆకాశాలను భూమిని పరమార్థముతో సృష్టించాడని తెలిసితే ఇందులో గొప్ప నిదర్శనము దొరుకుతుంది"** అని కలదు. ఈ వాక్యములో ఏదయినా జ్ఞానముంటే అది సత్యబద్ధముగా ఉండునని అందరూ తెలియునట్లు ఈ వాక్యమును చెప్పాడు. ఈ విధముగా ఖురాన్ గ్రంథములో చాలాచోట్ల 'సత్యము' అను పదమును ఉప యోగించడము వలన, సత్యము ప్రత్యక్షముగా నిరూపణకు వచ్చునది కావున, యదార్థ విషయముగా ప్రత్యక్షముగా జరుగును. కావున ఎవరు మేము పెద్ద జ్ఞానులమని ప్రచారము చేసుకొనినా 'శాస్త్రబద్దత' అను దేవుని సత్యము వలన సులభముగా ఎదుటివాడు జ్ఞానియో కాదో తెలిసిపోవును.

**43, ప్ర :- మీరు ఇంతకుముందు "కుమ్మరోల్ల పెళ్ళికూతురు దిబ్బమీదికి వచ్చినప్పుడు తెలుస్తుందిలే" అనుమాటలో కొంతయే చెప్పినట్లయినది. ఈ మాటను సామెతగా చాలామంది పల్లెటూర్లలో వాడుట నేను కూడా చూచాను. 'కుమ్మరోల్ల పెళ్ళికూతురు' అను పేరును ఎందుకు వాడారు? చెప్పండి.**

**జవాబు :-** పెళ్ళి అంటే 'దేవుడు' అని అర్థము అని చాలామార్లు మేము చెప్పాము. పెళ్ళికొడుకు అంటే దేవుని కొడుకు అని కూడా చెప్పాము. ఒక సందర్భములో భగవంతున్ని కూడా పెళ్ళికొడుకు అని చెప్పడము జరుగుతుంది. అంతేకాక పెళ్ళికొడుకు అనినా, పెళ్ళికూతురు అనినా మోక్షమును కోరువాడని, దేవునిలోనికి ఐక్యమగుటకు తగిన జ్ఞాన సముపార్జన చేసినవారని అర్థము. దేవునిలోనికి ఐక్యము కావాలని, మోక్షము

పొందాలను వారు జ్ఞానులైయుండి యోగమును ఆచరించువారై యుండుట వలన వారిలో కర్మలను కాల్చు జ్ఞానశక్తి తయారైయుండును. ఆత్మశక్తిని లేక జ్ఞానశక్తిని అగ్నిగా జ్ఞానాగ్నిగా భగవద్గీతలో చెప్పారు. అదే జ్ఞానశక్తిని ఆత్మశక్తిగా కూడా చెప్పవచ్చును. ఆత్మశక్తికి గుర్తుగా శరీరములో వెంట్రుకలు ఉన్నాయని గతములో **"వెంట్రుక ఆత్మకు గుర్తు"** అని ప్రవచనమును కూడా చెప్పియున్నాము. యోగి అయినవాడు ఆత్మశక్తిని అనగా జ్ఞానాగ్నిని బాగా సంపాదించుకొని కర్మను కాల్చుకొను స్థోమత కల్గియుండును.

అది అటుంచి "కుమ్మరోల్లు" అను పదమును ఎందుకు వాడాము అంటే, కుమ్మరి వారు తలమీద మట్టిని మోసి మోసి తలమీద వెంట్రుకలన్నీ ఊడిపోయివుండును. వెంట్రుకలు లేనివారు అని తెలుపుటకు కుమ్మరోల్ల అనుమాటను వాడారు. కొందరు తమవద్ద ఏమాత్రము జ్ఞానము లేకున్నా జ్ఞానశక్తి లేకున్నా, తాము శక్తిగలవారమని కర్మను కాల్చుకొని కర్మలేనివారుగా ఉన్నామని, మేము నిజమైన యోగులమని దేవునియందు ఐక్యమగుటకు సిద్ధముగా ఉన్నామని చెప్పుకొనుచుందురు. అయితే అటువంటి వారివద్ద ఏమాత్రము జ్ఞానముగానీ, జ్ఞానశక్తిగానీ లేకుండునని చెప్పు నిమిత్తము వెంట్రుకలులేని కుమ్మరివాళ్ళ పెళ్ళికూతురును చెప్పడము జరిగినది. జ్ఞానములేకున్ననూ జ్ఞానమున్నవారివలె బయటికి చెప్పుకొనుచూ యోగుల వలె నటించుచుందురు. కావున వెంట్రుకలు లేకున్నా పైకి కనిపించునట్లు విగ్గును పెట్టుకొన్న కుమ్మరివాల్ల పెళ్ళికూతురును చెప్పాము. లేని జ్ఞానమున్నట్లు మోక్షమునకు దగ్గరగాయున్నట్లు చెప్పుకొను వారిని వెంట్రుకలు లేకున్నా పొడవాటి జడయున్న పెళ్ళికూతురని ప్రచారము చేసినట్లు చెప్పుకొనుచుందురని చెప్పాము. ఎప్పుడయినా గట్టి సమస్య వచ్చినప్పుడు వారివద్ద ఏమాత్రము జ్ఞానములేదని తెలియునట్లు మట్టిదిబ్బ

ఎక్కినప్పుడు వెంట్రుకలు లేవు అని తెలిసినదని అర్థమగునట్లు 'దిబ్బను ఎక్కిన పెళ్ళికూతురును చూస్తే' అని వాక్యములో చెప్పారు. మొత్తము మీద ఈ సామెతయంతయు జ్ఞానముతో అనుసంధానము చేయబడి ఉన్నది. అందువలన తలవెంట్రుకలు లేని కుమ్మరివాళ్ళ పెళ్ళికూతురును చెప్పవలసి వచ్చినది.

| | |
|---|---|
| **దేవునిలోనికి ఐక్యము కావాలనుకొనువాడు** | **= పెళ్ళికొడుకు (పెళ్ళికూతురు)** |
| **జ్ఞానములేనివారు** | **= వెంట్రుకలు లేనివారు.** |
| **జ్ఞానులని చెప్పకొనువారు** | **= మోక్షము కొరకు ప్రయత్నించు వారు.** |
| **దిబ్బయను గట్టి సమస్యలు** | **= కర్మ పరీక్షలు, రోగములు వచ్చినప్పడు.** |
| **దిబ్బమీద తెలియదా!** | **= కర్మలున్నప్పడు తెలియును కదా!** |

ఈ విధముగా దేవుడు తన జ్ఞానమును వివరముగా తెలియునట్లు అనేక వాక్యములలో, సామెతలలో, కథలలో తెలియజేశాడు. ఇంతటితో ఈ సామెతను పూర్తిగా వివరించి చెప్పినట్లయినది.

**44, ప్ర:- నేను సంపూర్ణ జ్ఞానిని అని ఒక వ్యక్తి పూర్తి గర్వమును పొంది యుండి మాట్లాడుచున్నాడనుకో! అప్పడు ఆ వ్యక్తిని జ్ఞానము లేనివాడని ఎలా నిరూపించవచ్చును?**

**జవాబు :-** దేవుడు భగవద్గీతయందు జ్ఞానయోగములో జ్ఞానమను అగ్ని గలవాడు తన కర్మను కాల్చివేయును అని చెప్పుచూ, **"జ్ఞానాగ్ని సర్వకర్మాణి"** అని అన్నారు. ఇక్కడ దేవుని వాక్యమును అనుసరించి జ్ఞానము గలవాడైతే

వాడు కర్మను లేకుండా చేసుకోగలడు. అట్లుకాకుండా ఒక కర్మను అనుభవిస్తున్నాడు అంటే వానివద్ద జ్ఞానాగ్ని లేనట్లేనని తెలియుచున్నది. జ్ఞానాగ్ని కలవాడు నూటికి ఇరవై శాతము కర్మను అనుభవించవచ్చును. మిగతా దానిని లేకుండా చేసుకోగలడు.

**45, ప్ర :- మీరు, జ్ఞానమను అగ్ని జ్ఞానము తెలిసిన వారివద్ద యుంటుందని, దానివలన వారి కర్మ కాలిపోతుందని చెప్పచున్నారు కదా! దేవుని జ్ఞానము అన్ని మతములకు ఒకటే అయినప్పడు, దేవుడు అన్ని మతముల వారికి ఒకడే అయినప్పడు జ్ఞానాగ్ని అనునది హిందూమతమునకు ఒక దానికేయుండునా? మిగతా రెండు మతములకు కూడా అట్లే యుండునా?**

**జవాబు :-** దేవుడు సర్వప్రపంచమునకు ఒక్కడే అయినప్పుడు, ఆయన జ్ఞానము కూడా సర్వ మానవులకు ఒక్కటేయుండును. ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క జ్ఞానముండదు. సర్వమానవులకు దేవుడు ఒక్కడే, జ్ఞానము ఒక్కటే అని తెలియవలెను. మొదటి దైవగ్రంథమయిన భగవద్గీతలో చెప్పిన 'జ్ఞానాగ్ని' అనునదే అన్ని దైవగ్రంథములలో కూడా చెప్పబడినది. హిందూ ధర్మము లలో చెప్పినట్లు మనుషల కర్మలను జ్ఞానాగ్ని చేత మిగతా రెండు మతముల వారు లేకుండా చేసుకోవచ్చును. అందులో ఏ సంశయములేదు.

**46, ప్ర :- క్రైస్తవ మతములోగానీ, ముస్లీమ్ మతములోగానీ ఎక్కడా 'జ్ఞానాగ్ని' అనే మాటే లేదు. అలాంటప్పడు మీ మాట నిజమంటారా?**

**జవాబు :-** ఇటువంటి అనుమానములు మనుషులకు వచ్చుననే తెలిసి ముందుగానే ఈ గ్రంథమును **"ఏది నిజమైన జ్ఞానము?"** అను పేరుతో వ్రాయవలసివచ్చినది. మేము చెప్పునది నిజమైన జ్ఞానమా కాదా!యని తెలియుటకు ఇందులో కొన్ని సూత్రములను చెప్పియున్నాము. దాని

ప్రకారము మేము చెప్పునదిగానీ, ఇతరులు చెప్పునదిగానీ సరియైన జ్ఞానమా కాదా!యని సులభముగా తెలియవచ్చును. భగవద్గీతలో **'జ్ఞానాగ్ని', 'కర్మ దహనము'** అని వ్రాయబడియున్నది. మిగతా గ్రంథములలో కూడా ఈ విషయమే యున్నదిగానీ, అక్కడ చెప్పిన పదములకు ఇక్కడ చెప్పిన పదములకు కొంత తేడాయుండుట వలన మిగతా గ్రంథములలో చెప్ప లేదేమో! అనుకోవడము జరుగుచున్నది. ఉదాహరణకు ఒక వాక్యమును చూస్తాము. అమ్మాయి నీ వయస్సెంత? అని ఒక ప్రాంతములో అడుగు తారు. ఇంకొక ప్రాంతములో వారికి అలవాటయిన భాష ప్రకారము వయస్సు నీకెంత అమ్మాయి? అని అడిగారనుకో! మరొక ప్రాంతములో అమ్మీ నీ ఈడెంత? అని అడిగారనుకో! మూడు మాటలలో భావము ఒక్కటే! వయస్సును గురించి అడుగు ఉద్దేశ్యము తప్ప అందులో ఏమీ లేదు. అయితే మూడు మాటలు కొంత వేరువేరుగా ఉన్నాయి. బాగా గమనిస్తే అన్నీ ఒకే ప్రశ్నే అని తెలియును. యోచించక పోతే వేరువేరు వాక్యము లేమో! అన్నట్లు కనిపించును. అదే విధముగా 'జ్ఞానాగ్ని' అను విషయము కూడా మూడు గ్రంథములలో, మూడు రకములుగా వ్రాసియుండుట వలన మూడింటియందు చెప్పినది ఒక్కటేయని చాలామంది తెలియలేకున్నారు. భగవద్గీతలో కర్మదహనము 'జ్ఞానాగ్ని' వలన కలుగునని చెప్పారు. బైబిలు లోనికి వచ్చేటప్పటికి మొదట భగవద్గీతలో చెప్పినవాడే ఇక్కడ బైబిలులో కూడా చెప్పినా , చెప్పిన విధానము కొంత వేరుగాయుండుట వలన, చెప్పిన జ్ఞానము ఒకటే అయినా, దానిని మనిషి గుర్తించలేకపోయాడు. బైబిలులో **"పాపక్షమాపణ"** అని చెప్పాడు. కర్మదహనమును "పాపక్షమాపణ" అనియు, జ్ఞానాగ్ని చేత అను మాటను **"నిబంధన రక్తము"** చేత అనడము వలన **జ్ఞానాగ్ని** అనినా, **నిబంధన రక్తము** అనినా రెండూ ఒకటేనని

మనిషి తెలియలేకపోయాడు. ఖురాన్ గ్రంథములోనికి వచ్చేటప్పటికి పాపము లేకుండా పోవు దానినే మరొక రకముగా చెప్పడము వలన దానిని ఏమాత్రము గుర్తించలేకపోయారు. ఖురాన్ గ్రంథములో దేవుడు తన కరుణచేత నీ కర్మలను లేకుండా చేయునని చెప్పుచూ **"దేవుడు క్షమాశీలుడు"**, **"ఎంతటి కర్మనయినా దేవుడు క్షమించగలడు"** అని చెప్పడముతో మొదట భగవద్గీతలో చెప్పిన దానికి, చివరి గ్రంథములో చెప్పినదానికి ఎంతో తేడా కనిపించడము వలన, అక్కడ చెప్పినదే ఇక్కడ చెప్పాడు అని ఎవరూ అర్థము చేసుకోలేక పోయారు.

ఈ విధముగా ఒకే జ్ఞానమే మూడు గ్రంథములలో మూడు రకములుగా చెప్పబడుట వలన దానిని చాలామంది గుర్తించక అక్కడ చెప్పినది వేరు, ఇక్కడ చెప్పినది వేరని అనుకొంటున్నారు. దేవుడు మూడు గ్రంథములలో ఒకే జ్ఞానమును చెప్పాడుగానీ వేరు జ్ఞానమును చెప్పలేదు. అట్లే ఇంకొక విషయమును గమనిస్తే దేవుని జ్ఞానము వేరుగా అర్థము చేసుకోకూడదని తెలిసిపోతుంది. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో ముగ్గురు పురుషులను గురించి చెప్పుచున్నానని **"క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు"** అని ముగ్గురిని చెప్పాడు. అదే ద్వితీయ దైవగ్రంథము లోనికి వచ్చేటప్పటికి అందులో అదే ముగ్గురు పురుషులను అక్కడ చెప్పినట్లు చెప్పక **"తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ"**యని పేర్లు మార్చి చెప్పాడు. అప్పుడు భగవద్గీతలో చెప్పిన ముగ్గురు పురుషులనే ఇక్కడ చెప్పారని క్రైస్తవులు ఎవరూ గ్రహించలేక పోయారు. అట్లే అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో ఏమాత్రము గుర్తించనట్లు ముగ్గురిని గురించి చెప్పడమైనది. ఖురాన్‌లో **"తోలేవాడు, తోలబడేవాడు, సాక్షిగా చూచేవాడు"** అని ముగ్గురిని చెప్పినా ప్రథమ దైవగ్రంథమునకు తర్వాత చెప్పిన రెండు గ్రంథములకు

ఎంతో తేడా కనిపించడముతో ఎవరికీ ఇది ముగ్గురు పురుషుల విషయమని భగవద్గీతలోని జ్ఞానమని జ్ఞాపకము రాకుండా పోయినది. దీనినిబట్టి దేవుడు మూడు గ్రంథములలో ఒకే జ్ఞానమును చెప్పినా మనిషి తెలియ లేకున్నాడని తెలియుచున్నది.

**47, ప్ర :- భూమిమీద మూడు దైవగ్రంథములున్నాయని చెప్పారు కదా! ఆ మూడింటిని వేరువేరు వ్యక్తులు చెప్పారు. మూడు గ్రంథములలోనిది ఒకే జ్ఞానమయినప్పుడు ముగ్గురు ఎందుకు చెప్పారు?**

**జవాబు :-** మూడు గ్రంథములు మనకు కనిపించినా వాటిని చెప్పినవారు ఫలానావారని తెలిసినా, నిజానికి మూడు గ్రంథములను చెప్పిన వారు ఎవరో ఇంతవరకు చాలామందికిగానీ, కొద్దిమందికిగానీ, ఎవరికిగానీ తెలియదు.

**48, ప్ర :- అదేమిటి! అందరికీ తెలిసినట్లు కృష్ణుడు భగవద్గీతను, ఏసు బైబిలును, జిబ్రయేల్ ఖురాన్ గ్రంథమును చెప్పాడని తెలుసు. ఇంకా చెప్పితే కృష్ణుడు అర్జునునికి భగవద్గీతను, ఏసు వారిశిష్యులకు బైబిలును, జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి ఖురాన్ గ్రంథమును చెప్పినట్లు అందరికీ తెలిసియుండగా! మీరు ఎవరికీ తెలియదని చెప్పడమేమిటి?**

**జవాబు :-** ఆ విధముగా అందరికీ తెలుసునని నాకు తెలుసు. అందువలననే నిజముగా వాటిని చెప్పినవారు ఎవరో తెలియదని చెప్పాను. ఖురాన్ గ్రంథమును చెప్పినది జిబ్రయేల్ అని చెప్పినా అతనిని 'దూత' అంటున్నారు. ఖురాన్ గ్రంథములోనే జిబ్రయేల్ దూతకాదు, ఆయన **"నమ్మదగిన ఒక ఆత్మ"** అని సూరా 2, ఆయత్ 97లోను మరియు (26-193), (70-4), (78-38), (97-4)లలో చెప్పియున్నారు.

జిబ్రయేల్ ఆకాశమునుండి దిగి వచ్చిన ఒక ఆత్మయనీ, ఆయన గ్రహముగా ఖగోళములో యున్నాడనీ ఎవరికీ తెలియదు. ఆయన విషయమదికాగా, భగవద్గీతను, బైబిలును చెప్పినవారు కృష్ణుడు, క్రీస్తు ఇద్దరు అయినా వారు ఇద్దరుకాదని ఒకే మనిషి ఇద్దరుగా మారువేషములో వచ్చాడను విషయము కూడా ఎవరికీ తెలియదు. అలా ఇద్దరుగా వచ్చినా అసలు వ్యక్తి ఎవరను విషయము ఇంతవరకు ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. ఖురాన్ గ్రంథమును చెప్పినది జిబ్రయేల్ అనుమాట వాస్తవమే అయినా, జిబ్రయేల్ దేవదూత కాదు అను విషయము, ఆయన ఖగోళములో గొప్ప పనులు నిర్వర్తించు దేవుని పాలనలోని గ్రహమని చాలామందికి తెలియదు.

**49, ప్ర :- "భగవద్గీతను (తౌరాత్‌ను), బైబిలును (ఇంజీలును) చెప్పినవారు ఇద్దరు కాగా ఒక్కరే అలా మారువేషములో వచ్చాడు" అని మీరు అంటున్నారు. ఆ ఒక్కరు ఎవరు?**

**జవాబు :-** ఆ ఒక్కరే **"దేవుడు"**. ఆయన జ్ఞానము ఆయన తప్ప ఇతరులు ఎవరూ చెప్పుటకు వీలులేదు. ఏ మానవునకు దేవుని విషయము తెలియనప్పుడు ఎవడయినా దేవుని విషయము (జ్ఞానము) చెప్పాడు అంటే వాడు మారువేషములోయున్న దేవుడేనని తెలియవచ్చును. అలా మనిషిగా వచ్చి చెప్పునప్పుడు అతను దేవుడే అయినా ఆ సమయములో అతనిని దేవుడు అని అనకూడదు. 'దేవుని దూత' అనిగానీ, 'భగవంతుడు' అనిగానీ చెప్పవచ్చును. ఆయన మారువేషములో భగవంతునిగా మనిషి ఆకారములో యున్నా, సాధారణ సామాన్య మనిషిగా కనిపించుచుండినా అతను మనిషి కాదు. అసలయిన 'దేవుడు' అని గుర్తించుకోవలెను. జిబ్రయేల్ దేవుని పాలనలోని ఒక గ్రహము. ఆయన ఖగోళములో సూర్యుని ద్వారా

జ్ఞానమును తెలిసి దానినే ప్రవక్తగారికి చెప్పాడు. ఆయన చెప్పినది దేవుని జ్ఞానమే కనుక భగవద్గీత, బైబిలు, ఖురాన్‌లలోని జ్ఞానమంతా ఒక్కటేయని చెప్పవచ్చును.

**50, ప్ర :- మూడు గ్రంథములలోని జ్ఞానము ఒక్కటే అయినప్పుడు ఒక హిందువు ఎంత జ్ఞాని అయితే ఒక ముస్లీమ్ కూడా అంత జ్ఞానికాగలడు కదా! అలాగే ఒక ముస్లీమ్ ఎంత జ్ఞాని అయితే అంతటి వానిగా క్రైస్తవుడు కూడా కావచ్చును కదా! మూడిటిలో ఒకే దైవజ్ఞానమున్నప్పుడు మూడు మతములలో సమాన జ్ఞానులుండవచ్చును కదా! మనుషులలో ఒకే జ్ఞానము ఎందుకు లేకుండా పోయినది? ఒకడు తూర్పుకు మ్రొక్కితే మరియొకడు పడమటికి మ్రొక్కుచున్నాడు. ఒకడు యోగము చేస్తే, మరొకడు ప్రార్థన చేస్తున్నాడు. ఒకడు దేవుడు అంటే మరియొకడు కాదు అల్లాహ్ అంటాడు. ఈ వ్యత్యాసములు ఎందుకొచ్చాయి?**

**జవాబు :-** ఎంతసేపు చెప్పినా ప్రపంచమునకంతటికీ దేవుడు ఒక్కడే! దేవుని జ్ఞానము ఒక్కటే!! అయితే దేవుని జ్ఞానమును మనిషి అర్థము చేసుకోవడములో ఎన్నో రకములుగా చీలిపోవుచున్నాడు. మనిషిలోని బుద్ధి, శ్రద్ధనుబట్టి మనిషికి దేవుడు, దేవుని జ్ఞానము అర్థమగుచుండును. అందువలన ఒకే భగవద్గీతను చదివిన వారిలో వేరువేరు జ్ఞానులున్నారు. ఒకే జ్ఞానమున్న బైబిలు, ఖురాన్ చదివినవారిలో వారికి జ్ఞానము వేరుగా అర్థమగుట వలన వారిలో ఒకడు నీతి, న్యాయము అవసరమంటే మరియొకడు అవి రెండు లోక సంబంధమైనవి, అలా కాకుండా దైవసంబంధ జ్ఞానము, ధర్మమును తెలియాలి అని అంటున్నాడు. ఈ విధముగా గ్రహించుకోవడము వలన జ్ఞానము హెచ్చుతగ్గులుగా అర్థమగుచున్నది. మన అవగాహన లోపములోని తేడాల వలన ఒకడు తూర్పు అని

మరియొకడు పడమరయని అంటున్నాడు. దేవుడు సర్వవ్యాపి అయినందున ఆయనకు తూర్పు ఎంతో, పడమర కూడా అంతేయుండును. దేవునికి రెండూ సమానమే. అన్ని విషయములలోను, అన్ని జ్ఞానములలోను మనిషి దేవుడు చెప్పిన దానిని గ్రహించుకోవడములో వచ్చిన మార్పుల వలన ఒకడు దేవుడు అంటే మరియొకడు అల్లాహ్ అంటున్నాడు. ఎలా అనినా దేవుని లెక్కలో ఒకటే. ఇట్లు కొన్ని విషయములలో మనిషి పొరపాటు పడగా మరికొన్ని విషయములలో దేవుడు చెప్పిన దానికి పూర్తి వ్యతిరేఖముగా అర్థమయిన విషయములు కూడా కలవు. దేవునికి పూర్తి వ్యతిరేఖముగా ఉన్న ఆచరణలను చేయుచూ, దేవునికి ఇష్టమైన పనిని చేయుచున్నానని పొరపాటు పడిన విషయములు చాలా గలవు. ఉదాహరణకు భగవద్గీతలో స్వయముగా దేవుడు చెప్పిన జ్ఞానములో ఆహారమును తినకుండా ఉపవాస ముండకూడదనీ, అలా ఆహారము తీసుకోకపోతే వాడు ఇబ్బందిపడేదికాక లోపలయున్న ఆత్మను కూడా ఇబ్బంది పెట్టుదురని, అది రాక్షసత్వమగునని శ్రద్ధాత్రయ విభాగయోగములో ఆరవ శ్లోకమందు చెప్పబడియున్నది. శరీర అవయవములను కృశింపజేయడమేగాక శరీరములోయున్న వారు, వారి యందున్న నన్ను ఇబ్బంది పెట్టుచున్నారనీ, ఆత్మ కార్యములకు ఆటంకము కల్గించుచున్నారనీ, అది మంచిది కాదనీ దానిని తామస జ్ఞానమంటారనీ దేవుడు చెప్పియున్నాడు. దేవుడు తన మొదటి గ్రంథములో ఏమి చెప్పాడో దానికి వ్యతిరేఖముగా మిగతా రెండు గ్రంథములలో ఏమీ చెప్పలేదు. మిగతా రెండు గ్రంథములు మొదటి గ్రంథములోని జ్ఞానమునే ధృవ పరుస్తున్నవి. మొదటి గ్రంథమయిన భగవద్గీత జ్ఞానమునే ధృవపరుస్తు నట్లు ఖురాన్ గ్రంథములో చాలా వాక్యములలో చెప్పారు. ఈ విధముగా దేవుడు ఒక గ్రంథములో చెప్పిన జ్ఞానమునకు విరుద్ధముగా వేరొక గ్రంథములో ఎక్కడా చెప్పలేదు. ఒకవేళ ఎక్కడయినా వ్యతిరేఖ వాక్యమున్న

దంటే అది దేవుడు చెప్పినది కాదని, అది మనుషుల సృష్ఠేయని తెలియవలెను. అప్పుడు మనుషుల కలుషితమును తీసివేసి చదువుకోవాలి. లేకపోతే దేవుని మార్గమును వదలి ప్రక్కకు పోయినట్లగును. అందువలన అందరూ చాలా జాగ్రత్తగా జ్ఞానమును చూడవలసియున్నది. ఉన్నదంతా జ్ఞానమనుకోకూడదు.

భగవద్గీతలో ఇది మంచిపని కాదు అని దేవుడు చెప్పితే, మరొక మతము వారు దేవుడు చేయవద్దని గీతలో చెప్పిన పనినే చేస్తున్నారు. అక్కడ వారి మతములో ముఖ్యమైన పనిగా పెట్టుకొన్నారు. రెండు మతములకు, రెండు మతములు అనుసరిస్తున్న రెండు దైవగ్రంథములకు దేవుడు ఒకడే పెద్ద అయినప్పుడు, ఒక మతములో కాదని, మరొక మతములో ఔనని చెప్పునా? అని ప్రశ్న రాక తప్పదు. దేవుడు అలా ఒకచోట ఒకరకము, మరొకచోట మరొక రకముగా ఎప్పుడూ చెప్పలేదు. మనుషులు దేవుడు చెప్పిన దానిని అర్థము చేసుకోలేక తప్పుదారి పట్టి పోయారు తప్ప అది దేవుడు చెప్పిన విధానము కాదు. దేవుడు ప్రథమ దైవగ్రంథమయిన తన భగవద్గీతలో ఉపవాసము చేయవద్దని, అటువంటి ఆరాధన వలన శరీరములోని ఆత్మను ఇబ్బంది పెట్టి ఎండబెట్టినట్లగునని చెప్పి, తర్వాత తన అంతిమ దైవగ్రంథమున ఉపవాసముండమని చెప్పునా? అలా ఎక్కడా చెప్పలేదు. చెప్పని దానిని చెప్పినట్లు తలపోసి దానిని దేవుని ఆరాధనలో భాగమని చెప్పడము తామసమని, మనిషి అజ్ఞానమని గీతలోనే చెప్పాడు.

భగవద్గీతలో వేదములను చదువుట, దానములు చేయుట, యజ్ఞములు చేయుట, తపస్సు (ధ్యానము) చేయుట తన ఆరాధనలోని భాగములు కాదని, వాటి వలన నేను తెలియబడనని చెప్పిన దేవుడు వేరొక

గ్రంథములో వేరొక విధానమును తన ఆరాధనయని చెప్పునా? **తన ఆరాధనలు మూడు యోగములు మాత్రమేయని చెప్పాడు.** వాటి మినహా వేరే క్రియలేవీ తన ఆరాధనలు కావని తేల్చి చెప్పడమైనది. అటువంటప్పుడు వేరేది ఎక్కడయినా తెలిసిందంటే అది ప్రపంచ సంబంధమైనదైనా అయివుండాలి లేక మనము అర్థము చేసుకోవడములోనయినా పొరపాటు పడియుండాలి. అంతేగానీ మన తప్పులను దేవుని మీద వేసి దేవుడే అలా చెప్పాడనడము మంచిదికాదు. మనుషులలో ఇటువంటి లోపములున్నవని గ్రహించిన దేవుడు ఎవరిది మంచి జ్ఞానమో, ఎవరిది శాస్త్రబద్ధమైన జ్ఞానమో, ఎవరిది నిజమైన జ్ఞానమో, ఎవరిది హేతుబద్ధమైన జ్ఞానమో, ఎవరిది దేవుని జ్ఞానమో తెలియుటకు ఒక విధానమును ఏర్పరచాడు. అదియే సత్యమును ఆధారము చేసుకొని చూడడము, సత్యము అనగా శాస్త్రము అని అర్థము. శాస్త్రము అనగా జరిగితీరునదని అర్థము. సత్యము అనగా ప్రత్యక్షముగా జరుగునదని అర్థము. జరిగి తీరునదని కూడా అర్థము. జరిగితీరునది శాస్త్రమగును, అలాగే శాపమగును. శాపము అనగా సత్యముగా జరుగునదని అర్థము. అందువలన శాస్త్రమును ఆధారము చేసుకొని నీకు తెలిసిన జ్ఞానము సరియైనదో కాదో తేల్చి చూచుకోమని చెప్పాడు. అదే విషయమును గుర్తు చేయుచు భగవద్గీత దైవాసుర సంపద్విభాగ యోగమున 23వ శ్లోకమందు **"ఎవడయితే శాస్త్ర విధానమును వదలి వానికిష్టమొచ్చిన దానిని జ్ఞానమనుకొని దానిని అనుసరిస్తే అట్టివానికి మోక్షము లభించదు. వానికి దేవుని జ్ఞానము ఏదో సత్యముగా తెలియకపోవడమువలన వాడు ఎప్పటికీ పరమ పదమును పొందలేదు"** అని చెప్పుచూ ప్రక్కనే గల 24వ శ్లోకములో ఈ విధముగా తెల్పుచున్నాడు చూడండి.

23వ శ్లో॥ యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥

**భావము :-** "దైవమార్గములో శాస్త్రమును అనుసరించక ఇష్టమొచ్చినట్లు నడుచుకొనువాడు జ్ఞానికాలేడు, సిద్ధిపొందలేడు. దానివలన వాడికి ఎటువంటి సుఖము దక్కదు, పరమ పదమును పొందలేడు"

24వ శ్లో॥ తస్మా ఛ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్య వస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి ॥

**భావము :-** "దైవమార్గములో ఏవి చేయవలసిన పనులో, ఏవి చేయకూడని పనులో శాస్త్రమే తేల్చి చెప్పుతుంది. దానికి శాస్త్రమే ప్రమాణముగా ఉన్నది. అందువలన శాస్త్ర విధానము తెలిసి ఎల్లప్పుడు శాస్త్రము చెప్పినట్లే చేయి"

ఈ రెండు శ్లోకములలో దేవుని మార్గమును అనుసరించువారు ఏమి చేయకూడదో ఏమి చేయవలెనో శాస్త్రమే చెప్పుతుంది. దాని ప్రకారము నడువండని చెప్పాడు. అలా నడువని వాడు జ్ఞానికాలేడని, మోక్షము పొందలేడని కూడా చెప్పడము జరిగినది.

**51, ప్ర :- శాస్త్రమంటే ఏది? శాస్త్రము ఎట్లు సత్యబద్ధమై ఉన్నది? మాకు అర్థమగుటకు వివరముగా చెప్పండి?**

**జవాబు :-** దేవుడు చెప్పిన ప్రతిమాట శాస్త్రమేయగును. దేవుడు చెప్పనిది అశాస్త్రమగును. దేవుడు చెప్పిన శాస్త్రమునకు బ్రహ్మవిద్యా శాస్త్రము అని పేరుగలదు. భగవద్గీత గ్రంథము గలదు. అందులో బ్రహ్మవిద్యా శాస్త్రము గలదు. లోకములో శాస్త్రములు ఆరువుండగా, అందులో ప్రపంచమునకు

సంబంధించినవి ఐదు శాస్త్రములుకాగా ఒక్కటిమాత్రము దేవునికి సంబంధించిన బ్రహ్మవిద్యాశాస్త్రము. ప్రపంచ విషయములకు శాస్త్రములున్నా ప్రపంచ పనులన్నియూ కర్మాధీనములో వుండి కర్మప్రకారము జరుగు చుండును. ఒక్క దైవమార్గములో దైవ కార్యములకు కర్మయుండదు. **దైవ కార్యములు కర్మాతీతమైనవి. అందువలన దైవకార్యములన్నియు మనిషి స్వయం నిర్ణయము మీద ఆధారపడియుండును.** మనిషి స్వయం నిర్ణయము సమయములో అజ్ఞాన నిర్ణయములు, దేవునికి వ్యతిరేఖ నిర్ణయములు చేయు అవకాశము గలదు. అట్లు దేవునికి సరిపోని పనులను చేయకుండుటకు ఏవి చేయవలసినవో, ఏవి చేయకూడనివో బ్రహ్మవిద్యా శాస్త్రము తేల్చి చెప్పును. కావున శాస్త్రముననుసరించి దేవుని పనులు చేయవలసియున్నది. బ్రహ్మవిద్యా శాస్త్రములో ఒక విషయమును చెప్పితే అది శాసనముగా ఉండును. అటువంటి విషయమును ఒక దానిని తీసుకొని చూస్తే భగవద్గీతలో సాంఖ్యయోగమున 27వ శ్లోకమందు ఇలా కలదు చూడండి.

సాంఖ్యయోగము 27వ శ్లోకము **"జాతస్య హి ధృవోమృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ"** అని కలదు. దాని భావము ప్రకారము **"పుట్టినవాడు చావక తప్పదు. చచ్చినవాడు తిరిగి పుట్టక తప్పదు, అనివార్యమైన ఈ కార్యము ఎప్పటికీ ఆగదు"** అని వుంది. బ్రహ్మవిద్యాశాస్త్రములోని దేవుని వాక్యము సత్యమై ఉండును. ఎందుకనగా అది శాసనముతో కూడుకొన్న శాస్త్రవచనము. అయితే మనుషులు చనిపోవునది మనము ప్రత్యక్షముగా చూస్తున్నాము. అలాగే మనుషులు పుట్టుచున్నది చూస్తున్నాము. అయితే వాక్యము ప్రకారము చనిపోయిన వాడే తిరిగి పుట్టుచున్నాడను విషయము మనకు తెలియదు. పుట్టేవారంతా వెనుక జన్మ జ్ఞప్తిని కోల్పోయి పుట్టు చున్నారు, గనుక చచ్చేవాని విషయము తెలిసినా, పుట్టేవాడు ఎవడు అను

విషయము తెలియదు. అటువంటప్పుడు దేవునిమాటలోని సత్యము తెలియకుండా పోగలదు. అట్లు కాకుండా దేవుడు ఎక్కడయినా ఒకచోట ఎప్పుడయినా ఒకనికి వెనుకటి జన్మ జ్ఞాపకము వచ్చునట్లు చేయుచున్నాడు. అలా జ్ఞాపకము వచ్చినవాడు తాను వెనుకటి జన్మలో ఎక్కడ చనిపోయినది, ఎప్పుడు చనిపోయినది, ఎట్లు చనిపోయినది చెప్పుచున్నాడు. వెనుకటి జన్మలోనున్న అన్నదమ్ములను, అక్కాచెల్లెల్లను చెప్పడమే కాక అక్కడికిపోయి గుర్తుపట్టి పలకరించుచున్నాడు. ఇదంతా దేవుని మాటకు ప్రత్యక్ష ప్రమాణముగా జరిగినట్లు తెలియుచున్నది. అప్పుడు దేవునిమాట సత్యబద్ధమని, శాస్త్రమని తెలిసిపోవుచున్నది. ప్రత్యక్షముగా జరిగిన కొన్ని సంఘటనలను ఇక్కడ చూస్తాము.

ఇపుడు మొదటి విధానములో ఆత్మ గతజన్మలను తెలియజేసిన యదార్థ సంఘటనలను వివరించుకొందాము. 1930వ సంవత్సరము జూన్ లేక జూలై నెల కాలములో లెబనాన్ దేశములో "హాసన్" అనే పేరుగల స్త్రీ జన్మించింది. పునర్జన్మలు లేవు అను చెప్పుచున్న ఇస్లామ్ మతములో హాసన్ జన్మించడము విశేషము. ఆమెకు 20 సంవత్సరముల యుక్తవయస్సులో "ఫరూక్" అను వ్యక్తితో వివాహము జరిగింది. ఫరూక్, హాసన్ జంటకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. హాసన్‌కు "నభీ" అనే సోదరుడు కూడా ఉండేవాడు. అతడు లెబనాన్ దేశములో లెబనాన్ సమాజములో చాలా పేరు పొందినవాడు. అయితే నభీ యుక్తవయస్సులో విమాన ప్రమాదములో మరణించాడు. హాసన్ తన రెండవ కూతురుకు జన్మ నిచ్చినపుడు అనారోగ్యముపాలై గుండె సమస్య వచ్చింది. దానివలన ఇక మీదట పిల్లలను కనకూడదని డాక్టర్లు సలహా ఇచ్చారు. అయితే హాసన్ ఆ సలహాను ఏమాత్రము పట్టించుకోకుండా 1962లో మూడవ మగబిడ్డకు

జన్మనిచ్చింది. 1963లో తన తమ్ముడు నభీ చనిపోవడముతో ఆమె ఆరోగ్యము మరీ క్షీణించను మొదలు పెట్టింది. అప్పుడు ఆమె తాను చనిపోవడము ఖాయమని అనుకున్నది. కొంతకాలమునకు 36 సంవత్సరముల వయస్సున్న హాసన్ వర్జీనియాలో ఉండే "రిచ్‌మడ్" అనే డాక్టర్‌వద్దకు గుండె ఆపరేషన్ కొరకు వెళ్ళింది. ఆపరేషన్‌కు ముందు తన పెద్దకూతురు లైలాకు ఫోన్ చేయబోయింది, కానీ చేయలేక పోయింది. ఆపరేషన్ తర్వాత ఒకరోజు మాత్రము బ్రతికి చాలా క్లిష్టపరిస్థితులలో హాసన్ మరణించింది.

హాసన్ మరణించిన పది రోజులకు సుజన్నేగానెమ్ అను బిడ్డ ఒక కుటుంబములో పుట్టింది. సుజన్నేగానెమ్ 16 నెలల వయస్సుగల చిన్న బిడ్డగా ఉండి మాటలు వచ్చీరాని సమయములో ఫోన్ తీసుకొని హలో లైలా! అని పదేపదే అంటూ ఉండేది. ఆ కుటుంబము వారికిగానీ, సుజన్నే తల్లికిగానీ లైలా ఎవరో? అంతచిన్న పాప అలా ఎందుకు ఫోన్‌లో పిలుస్తున్నదో అర్థము కాలేదు. తర్వాత ఆరునెలలు గడచిన సుజన్నేకు రెండు సంవత్సరముల వయస్సు పూర్తి అయింది. అప్పుడు మాటలు కూడా బాగా వచ్చాయి. అప్పుడు ఆమె తల్లి లైలా ఎవరు? అని అడిగింది. దానికి సుజన్నేగానెమ్ నాకు ఇద్దరు కూతుర్లున్నారని, వారిలో ఒక కూతురు పేరు లైలా అని చెప్పింది. అంతేకాక తన పేరు సుజన్నే కాదనీ, తనపేరు హాసన్ అని, తన భర్త పేరు ఫరూక్ అనీ, తన తల్లిదండ్రుల పేర్లు, తమ్ముళ్ళ పేర్లు, మిగతా కుటుంబ సభ్యుల పేర్లు మొత్తము 13 పేర్లు వరుసగా చెప్పింది. ఇంకా తన ఊరు యొక్క వివరాలు అడిగితే ఇప్పుడు నా తల చిన్నది ఇంకా కొంత కాలమునకు అన్ని విషయములు చెప్పుతానని చెప్పింది.

ఈ విధముగా సుజన్నే చెప్పిన మాటలను విని ఆమె కుటుంబము లోని వారు సుజన్నే ముందు జన్మలో హాసన్‌గా ఎక్కడ పుట్టిందో తెలుసు కోవాలనుకొన్నారు. ఆ వార్తను పత్రికల ద్వారా బయటికి తెలియజేశారు. అప్పుడు హాసన్ కుటుంబములోని వారూ, హాసన్ భర్త ఫరూక్ సుజన్నేను చూడటానికి వచ్చారు. మొదట ఫరూక్ కుటుంబము చిన్నపాపగానున్న సుజన్నే చెప్పు మాటలను నమ్మలేకపోయారు. హాసన్ బంధువులను సరిగ్గా వారి పేర్లతో సుజన్నే పిలువడముతో ఫరూక్ కుటుంబము ఆ పిల్లను నమ్మడము మొదలు పెట్టింది. హాసన్ తన నగలనూ, ఇతర ఆభరణములనూ వర్జీనియాలోని తన తమ్ముడు హెర్‌కులేకు ఇచ్చింది. ఇది సర్జరీకి ముందు జరిగిన సంగతి. ఆ నగలను హెర్‌కులేకు ఇస్తూ, వాటిని తన కూతుర్లకు అందజేయవలసిందిగా చెప్పింది. ఈ విషయము హాసన్‌కు వారి కుటుంబీకు లకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. ఇవన్నీ విన్న తర్వాత సుజన్నే గతజన్మలో హాసన్‌గా ఉండేదని ధృవీకరించబడింది.

చదవడానికిగానీ, వ్రాయడానికిగానీ రాకముందే సుజన్నే పేపరు మీద ఏవో నంబర్లు వ్రాసేది. తర్వాత ఆ నంబర్లు ఫరూక్ ఇంటి ఫోన్‌నంబరని తెలిసింది. సుజన్నేకు ఐదు సంవత్సరముల వయస్సున్నపుడే రోజుకు మూడు సార్లు ఫరూక్‌కు ఫోన్ చేసేది. ఫరూక్‌ని కలిసినపుడు సుజన్నే అతని ఒడిలో కూర్చొని నిద్రించేది. పోలీస్ ఉద్యోగము చేసే ఫరూక్, మరణించిన తన భార్య హాసన్ సుజన్నేగా జన్మించిందని అంగీకరించాడు. సుజన్నేకు ఏవైనా ఫోటోలు చూపిస్తే వాటిలోని వ్యక్తుల్ని గుర్తించడమే కాకుండా, హాసన్‌కు ఆ ఫోటోలోని వారితో సంబంధాన్ని సుజన్నే వివరించేది. కొన్ని హాసన్‌కు తప్ప ఎవరికీ తెలియని వివరాలను సుజన్నే వివరించేది. దీనివలన పోయిన జన్మలోని హాసన్ ఈ జన్మలో

సుజన్మేగా పుట్టినదని పూర్తి నిరూపణకు వచ్చినది. ఈ విషయముతో పునర్జన్మ ఉన్నదనీ నిరూపించబడినది. 40 సంవత్సరముల క్రితము జరిగిన ఈ సంఘటనను ఎవరూ కాదనలేరు మరియు ఖండించనూ లేరు.

మేము ఇంతగా పునర్జన్మలున్నాయని చెప్పినా నమ్మనివారు ఉండ వచ్చును. అందుకని ముస్లీమ్ కుటుంబములో చనిపోయి తిరిగి ముస్లీమ్ కుటుంబములోనే పుట్టిన ఒక వ్యక్తి యొక్క వాస్తవ సంఘటనను చూద్దాము. ఇంతకుముందు చెప్పినది ఒక ముస్లీమ్ స్త్రీ అయిన హాసన్ యొక్క పునర్జన్మ. ఇపుడు ఒక ముస్లీమ్ అయిన పురుషుని జన్మను గురించి చెప్పుచున్నాము. ఇది కూడా లెబనాన్ దేశములో జరిగినదే.

1943లో లెబనాన్ దేశమందు "ఫర్మట్ట" అనే నగరములో రషీద్ ఖాదీజ్ అను వ్యక్తి జన్మించాడు. అతను ఆటోమొబైల్ మెకానిక్‌గా జీవించేవాడు. అతనికి 25 సంవత్సరముల వయస్సులో ఒకనాడు ఇబ్రహీమ్ అనే స్నేహితుడు రషీద్‌ను కారులో షికారుకు తీసుకెళ్ళాడు. ఇబ్రహీమ్ సముద్రప్రాంతములో కారును వేగముగా నడుపుచుండగా, మిలటరీ బీచ్ అనే స్థలములో కారు అదుపుతప్పి ప్రమాదానికి గురియైనది. అప్పుడు రషీద్ కారులోనుండి బయటకు పడిపోయాడు. అలా పడినపుడు తలకు బలమైన గాయము కాగా రషీద్ అక్కడికక్కడే మరణించాడు. రషీద్ మరణించిన తర్వాత ఒక సంవత్సరమునకు "డానియల్‌జర్దీ" అనునతడు జన్మించాడు. డానియల్ జర్దీకి మాటలు వచ్చినపుడు పలికిన తొలిమాట ఇబ్రహీమ్. ప్రమాదము జరిగిన దినమున కారునడిపిన తన స్నేహితుని పేరు ఇబ్రహీమ్. డానియల్ జర్దీ అలా అనడము ఎవరికీ అర్థము కాలేదు. ఇబ్రహీమ్ అని ఎందుకు అన్నాడో తెలియలేదు. తర్వాత రెండేళ్ళ వయస్సులో డానియల్ జర్దీ, తనతల్లి "లతీషా" తో నేను ఇంటికెళ్ళాలి అని అన్నాడు.

తర్వాత ఆరు నెలలకు, అనగా రెండున్నర సంవత్సరములకు ఇది నా ఇల్లు కాదు, నువ్వు నా తల్లీకాదు. నాకు నాన్న లేడు, నా తండ్రి మరణించాడు అని కొన్ని మాటలు మాట్లాడాడు. అప్పటి తన తండ్రి అయిన యూసఫ్‌ని నాన్న అని పిలువకుండా యూసఫ్ అని పేరుతో పిలిచేవాడు. అంతేగాక తన తండ్రి "నయీమ్" అని చెప్పేవాడు. నయీమ్ అనేది రషీద్ తండ్రి యొక్క పేరు.

డానియల్ జర్దీకి రెండున్నర సంవత్సరముల వయస్సులోనే అతని కుటుంబమంతా పిక్నిక్‌కు వెళ్ళగా వారితోపాటు జర్దీ కూడా పోయాడు. అప్పుడు వారి బంధువులలో ఒకరు పర్‌మట్‌టా అను పేరును తప్పుగా ఉచ్ఛరించగా, జర్దీ సరిచేసి చెప్పాడు. అప్పుడు జర్దీ తండ్రి అయిన యూసఫ్ ఈ పేరు నీకెలా తెలుసు అని అడుగగా! ఈ నగరము పేరు నాకు బాగా తెలుసు, ఇది నేను నివసించిన నగరమే అని చెప్పాడు. డానియల్ జర్దీ చెప్పిన మాటలు అతని కుటుంబము వారికి ఏమీ అర్థము కాలేదు. తర్వాత కొంత కాలమునకు డానియల్ జర్దీ, తన తల్లీ కారులో ప్రయాణిస్తుండగా, వారి కారు మిలటరీ బీచ్ దగ్గరికి వచ్చేటప్పటికి ఆ ప్రదేశాన్ని చూచిన డానియల్ కళ్ళు మూసుకొని, చేతులతో ముఖాన్ని దాచుకొని ఏడ్వను మొదలు పెట్టాడు. తర్వాత "నేను మరణించింది ఇక్కడే" అని గట్టిగా అరిచాడు. అంతేకాక గతజన్మలో తాను కారు మెకానిక్‌ననీ, తన స్నేహితుడు ఇబ్రహీమ్ కారు నడుపుతుండగా కారు అదుపు తప్పిందనీ, అపుడు బయటపడిన తాను తలకు గాయమై మరణించానని చెప్పాడు.

స్కూల్లో డానియల్ జర్దీ నర్సరీ చదువుచున్న రోజుల్లో తనపేరు డానియల్ జర్దీ కాదనీ, రషీద్ ఖాదీజ్ అని చెప్పాడు. అదే స్కూల్లోనే మరొక సందర్భములో యుక్తవయస్సులోనున్న అందమైన లేడీటీచర్‌ను

చిన్నగా గిల్లి నువ్వు చాలా అందంగా ఉన్నావని చెప్పాడట. ఆ విధముగా మాటలలోనూ, చేతలలోనూ కొన్ని సందర్భములలో విచిత్రముగా కనిపిస్తున్న డానియల్, చెప్పేది ఎంతమటుకు నిజమోనని తెలుసుకొనుటకు అతని తండ్రి యూసఫ్, ఫర్‌మట్‌టాకు వెళ్ళి డానియల్ వర్ణించిన విధముగా కారు మెకానిక్‌ను గురించి, మిలటరీ బీచ్‌వద్ద ఆక్సిడెంట్‌ను గురించి విచారించగా డానియల్ చెప్పినదంతా నిజమని తెలిసింది. ఈ విషయమును తెలుసు కొనిన రషీద్ ఖాదీజ్ యొక్క బంధువులూ, మిత్రులూ డానియల్‌ను చూచే దానికి బయలుదేరి పోయారు. అలా పోయిన వారిని చూచిన డానియల్ రషీద్ చెల్లెలు నజ్లాను వెంటనే గుర్తించి ఆమెను పేరుతోనే పిలిచాడు. మొదట తన బంధువులనందరినీ చూడగానే డానియల్ తన తల్లి లతీషాతో వారందరికీ అరటి పళ్ళు తెచ్చి ఇమ్మని చెప్పాడు. గత జన్మలో రషీద్‌కు అరటి పళ్ళంటే చాలా ఇష్టము. రషీద్ మరణము తర్వాత రషీద్ గుర్తుకురాకుండా ఉండడానికి రషీద్ తల్లి అతని చెల్లి ఇద్దరు అరటి పళ్ళు తినడము మానేశారు. తర్వాత డానియల్ ఫర్‌మట్‌టాకు వెళ్ళగానే తన స్నేహితుడైన ఇబ్రహీమ్‌ను మరియొక స్నేహితుడైన బజాజ్‌ను గుర్తించి మాట్లాడాడు.

రషీద్ కుటుంబము వారంతా రషీద్ తిరిగి డానియల్ జర్దీగా పుట్టాడని అంగీకరించారు. రషీద్ కుటుంబము డానియల్ ఫోటోను తమ ఇంటిలో ఉంచుకొన్నారు. రషీద్ తన రెండవ జన్మలో కూడా కారు నడపాలంటే భయపడేవాడు. ఈ విధముగా కారు నడపాలంటే వచ్చు భయముగానీ, వెనుకటి జన్మ జ్ఞాపకముగానీ డానియల్ తెచ్చుకొంటే వచ్చినవి కావు. డానియల్‌కు ఏమాత్రము సంబంధము లేకుండా అతని శరీరములోనున్న ఆత్మ చేసిన మూడవ పనిగా మనము గుర్తించవచ్చును.

మనిషి చనిపోతే మళ్ళీ జన్మిస్తాడని మనుషులకు తెలియజేయుటకు ఆత్మ చేసిన పనిగా మనము చెప్పుకోవచ్చును. ప్రతి మనిషిలో జీవాత్మకు తోడుగా ఆత్మ నివసిస్తూ ఎక్కడో ఒకచోట ఈ విధమైన జ్ఞాపకమును తెప్పించిన సంఘటనలే పునర్జన్మ వృత్తాంతములు. పునర్జన్మలు లేవు అను వారి వాదన అబద్ధమనీ, ఉన్నాయనడము శాస్త్రబద్ధమనీ ఆత్మ తెలిపిన ఇటువంటి సంఘటనల వలన తెలియుచున్నది.

పునర్జన్మలు సత్యములని తెలిసినప్పుడు భగవద్గీతలో దేవుడు చెప్పిన మాట నిజమైనదని అర్థము కాగలదు. ఇట్లు దేవుడు తన జ్ఞానము సత్యమైనదని కొన్ని సంఘటనల ద్వారా తెలియజేశాడు. మనిషికి తెలిసినది ఏదయితే నిరూపణకు రాదో, అది దేవుని జ్ఞానము కాదని తెలియవలెను. ప్రత్యక్షముగా కనిపించునది దేవుని జ్ఞానమని ఒప్పుకోకపోతే వాడు సత్యమును ఒప్పుకోనట్లేయగును. **సత్యమును ఒప్పుకోనివాడు నేను జ్ఞానిని అని దేవున్ని ఎన్నిమార్లు ప్రార్థన చేసినా దేవుడు వానివైపు కూడా చూడడు.**

ఎవడయినా "నేను గొప్ప జ్ఞానిని, నాకు మా గ్రంథములోని జ్ఞానము తెలుసు, నాతో సమాన జ్ఞాని భూమిమీద ఎవడూ లేడు" అని అనుకో వచ్చును. అట్లు అనుకొనువారిని ఎవడు వద్దనడు. వాని నోటికి రాలేక కొందరు వానినే గొప్ప జ్ఞానిగా ప్రకటించినా వేరే ప్రజలకు దైవికముగా వచ్చే నష్టము ఏమీ లేదు. అలాగే దైవికముగా ఏమీ లాభము ఉండదు. వానికి లాభము లేకపోగా దైవికమయిన నష్టమేయుండును. అనవసర మయిన చోట పాపమును మూట గట్టుకోవలసి వచ్చును. జ్ఞానిని అని అనుకొను వానికి వానిని చూచి కర్మలు దూరముగా పోవలెనుగానీ, పాపములు రావడమేమిటి? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! వాడు తనను తాను జ్ఞానిని అనుకొన్నాడు, వానికి

తోడు మిగతా కొందరు కూడా అతనిని గొప్ప జ్ఞానియని అని ఉండవచ్చును. అయితే వానిని జ్ఞాని అని దేవుడు ఒప్పుకోలేదు కదా! అందువలన వాడు దేవుని లెక్కలో అజ్ఞానియే. అటువంటివానికి సర్వసాధారణముగా అందరికీ వచ్చినట్లే పాపములు వచ్చును. అతనిలో ఏ ప్రత్యేకతయుండదు, దైవికముగా అతడు జ్ఞానియే కాడు. అతని హోదాలు, బిరుదులు అన్నియూ ఇహలోకము నకే పరిమితి, పరలోకమునకు ఏమాత్రము పనికిరావు.

ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో **'జ్ఞానాగ్నితో కర్మ కాలి పోవును'** అని చెప్పాడు, రెండవ దైవగ్రంథములో **'పాపక్షమాపణ కలదు'** అని కలదు. మూడవ చివరి దైవగ్రంథములో **'దేవుడు క్షమాశీలుడు'** అని గలదు. మూడిటియందు పాపమును లేకుండా అనుభవించకుండా తప్పించు కొను విధానము చెప్పబడినది. ఎలా చెప్పినా జ్ఞానమున్నప్పుడే ఇవన్నీ జరుగును. నేడు ఎవడు నిజమైన జ్ఞాని అయితే, దేవుని ధర్మములను వాడు తెలిసి ఆచరించగలిగితే అట్టి హిందువు పాపమును కాల్చు "జ్ఞానాగ్ని"ని కల్గియుండును. అతడు క్రైస్తవుడు అయితే పాపమును కడిగివేయు **"నిబంధన రక్తము (జ్ఞానశక్తి)"** ని కల్గియుండును. అతనిని దేవుడు ముస్లీమ్‌గా పుట్టించి యుంటే అనగా అతడు ముస్లీమ్ అయితే క్షమాశీలుడై **"పాపమును క్షమించు స్థోమత"** కల్గియుండును. ఈ విషయము మూడు దైవగ్రంథము లలో చెప్పియున్న జ్ఞానమేనని మరువకూడదు.

ఏసు తన నిబంధన రక్తము చేత పాపములు కడిగివేయునని బైబిలు గ్రంథములో చెప్పియున్నాడు. ఆ మాట సత్యసమేతమై యున్నదని నిరూపించుటకు అతని జీవితములో ఎందరో పాపములను సంకల్పముతోనే కడిగివేసి మనుజుల పాపములనుండి రక్షణ కల్పించాడు. కుష్ఠురోగిని, గ్రుడ్డివానిని బాగుపరచి తన జ్ఞానమునకు ఇంతటి శక్తియున్నదని నిరూపించ

గలిగాడు. నేడు అందరికీ ప్రత్యక్ష ప్రమాణముగా దేవుని జ్ఞానము ఇంత గొప్పదని, జ్ఞానము అగ్నితో సమానముగాయున్నదని, అది ఏ పాపము నయినా కాల్చివేయగలదని నిరూపించు సంఘటనలు మావద్ద ఎన్నో జరిగాయి. పెద్ద పాపములయిన H.I.V రోగము (ఎయిడ్స్ రోగము), క్యాన్సర్ రోగము, డెంగీజ్వరము మొదలగు అనేక రోగములు మావద్దకు వచ్చి మా జ్ఞానమును నమ్మిన వారికి అందరికీ వారినుండి దూరముగా పోవడము జరిగినది. అటువంటి మేలు మా ద్వారా పొందినవారు వందల మంది గలరు.

నేడు మూడు మతములలో దేవునిమీద ఎక్కువ విశ్వాసము గలవారు ముస్లీమ్‌లేనని చెప్పవచ్చును. దేవునిమీద విశ్వాసములో వారికే మొదటి స్థానమని అసూయపడకుండా చెప్పవచ్చును. అయితే దేవుని జ్ఞానముమీద శ్రద్ధలో పూర్తి వెనుకబడిన వారు ముస్లీమ్‌లేయని చెప్పవచ్చును. దేవుని జ్ఞానము మీద శ్రద్ధలేనివారిలో మొదటి స్థానము వారిదేయని చెప్పవచ్చును. అలాగే ప్రపంచములో దేవుని కొరకు ప్రార్థన చేయువారిలో ముఖ్యులు ముస్లీమ్‌లేయని చెప్పవచ్చును. ప్రపంచములో అత్యవసర పనులు ఎన్నియున్నా వాటిని వదలివేసి దేవుని ప్రార్థనకు ప్రాధాన్యతనిచ్చి ప్రార్థన చేయువారిలో మొదటి స్థానము ముస్లీమ్‌లదేయని చెప్పవచ్చును. మిగతా మతములలో లేని ఎన్నో మంచి ఆచరణలున్నా, దేవుని విషయములో ఎంతో ఓపికగలవారై యున్నా వారిలో ఒకే ఒక లోపము గలదు. దేవుడు చెప్పిన **"జ్ఞానశక్తి"** వారిలో లేదు. దేవుడు చెప్పిన **"నిబంధన జ్ఞానము"** వారిలోలేదు. అల్లాహ్ ఖురాన్ గ్రంథములో చెప్పిన పాపములను లేకుండా చేయు **"పాప క్షమాశీలత"** వారిలో లేదు. వారు ఎవరి కర్మను కాల్చలేరు. వారి కర్మను వారు కాల్చుకోలేరు. మావద్ద శక్తివంతమైన జ్ఞానమున్నదని ఎవరి

పాపమును ప్రత్యక్షముగా లేకుండా చేయలేరు. నా జ్ఞానమును సత్య సమేతముగా సత్యబద్ధముగా మీకు ఇచ్చానని దేవుడు ఖురాన్ గ్రంథములో చెప్పినా, ఆ సత్యబద్ధతను తమ జీవితములలోనికి తెచ్చుకోలేకపోయారు.

ఎంతో జ్ఞాపకశక్తి, ఎంతో మేధాశక్తి ముస్లీమ్‌లలో దేవుడు నింపి పెట్టాడు. ఆ మేధాశక్తిని, జ్ఞాపకశక్తిని దేవుని జ్ఞానము మీద శ్రద్ధగా మార్చుకోగలిగితే, 'మాకు అంతా తెలుసు' అను గోడను కూల్చివేసి మేము ఇంకా తెలుసుకోవాలను ఆలోచనలోనికి వస్తే, వారు దేవుడు చెప్పిన క్షమాశీలుడు కాగలరు. అప్పుడు దేవుని లక్షణములు, దేవుని జ్ఞానము వారిలోనికి ప్రాకును. అప్పుడు వారి పాపమునుండి వారు బయటపడడమే కాక, వారు క్షమాశీలురై ఇతర పాపములను కూడా క్షమించగలరు. అప్పుడు ముస్లీమ్‌లు సంపూర్ణ జ్ఞానులని ప్రపంచమునకు తెలియగలదు. **మేము చెప్పినది అసూయతో కాదు ప్రేమతో అని తెలిసి మా మాటను అనుసరించండి. మీరు జ్ఞానశక్తి కలవారుకండి. కర్మను దహించండి.**

ఇట్లు

# యోగీశ్వర్

ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే
ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.

అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,
సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.

ఆధారమున్న ప్రతిదీ సత్యము కాదు,
ఆధారము లేని ప్రతిదీ అసత్యము కాదు.

# ఏది నిజమైన జ్ఞానము?

## ఇది నిజమైన జ్ఞానము
## ఇది నిబంధన జ్ఞానము
## ఇది మతాతీత జ్ఞానము
## ఇది ఆచరణ జ్ఞానము
## ఇది దేవుని జ్ఞానము
## ఇది శాస్త్రీయ జ్ఞానము


రచయిత : త్రిమత ఏకైక గురువు, ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



www.thraithashakam.org